


## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-50. న.పై. అర్ధసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికము గాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు. ఇతరమైన ఉత్తరములు: మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

---

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

## ఆమె రూపవతి

కొన్ని గర్భాశయ రోగములు ఆరోగ్యమును క్షీణింపచేయుటవల్ల ఆమె జీవిత సౌఖ్యమును అనుభవింపలేక సంతాన సౌభాగ్యమును పొందలేక పోవుచున్నది.





# అరుణ

### గర్భాశయ రోగనివారిణి

స్త్రీలకు ప్రత్యేకముగ కలిగెడి వ్యాధులన్నిటిని పారద్రోలును సంతాన సౌభాగ్యమును ప్రసాదించుచున్నది

ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్, మదరాసు - 17

---

## ఏజంట్లు కావాలి!

రాజమహేంద్రవరం, సికిందరాబాద్, హైదరాబాద్, కడప, తిరుపతి—యింకా యితర ప్రదేశాలలో మా పత్రికలు అమ్మబడనిచోట్లలో తమ స్వంత బాధ్యతపై అమ్ముటకు - ఏజంట్లుగా నున్నవారికి రూ. 100/-కు రూ. 20/-లు. కమీషను, ఒక ఫ్రీకాపీ యివ్వబడును.

అడ్వర్టైజ్‌మెంటులను కాన్వాస్ చేయువారికి మంచి కమీషను సదుపాయముల నివ్వగలము.

వివరములకు:

గృహలక్ష్మి కార్యాలయం

రాయపేట, మద్రాసు-14

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుటకేర్పడిన
సచిత్ర మాసపత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౯] ఆగస్టు 1957 [సంచిక ౮





తన లేబరెటరీలోనున్న శ్రీ ముద్దాలి రాఘవరామచంద్రరావు. ఈయన తలకట్టు విడిగా కొట్టనక్కరలేని తెలుగు టైపుమిషనును తయారుచేశారు. ఈయన మద్రాసులో అమెరికన్ సమాచార కార్యాలయములో టైపిస్టు

# విషయ సూచిక



కు సు మాం జ లి

కుమారి యన్. బి. గీత




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతీమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# స్వాతంత్ర్యోత్సవములు

ఏటేటా ఆగష్టు 15-వ తేదిన స్వాతంత్ర్య దినోత్సవమును యావద్భారతము జరుపుచున్నను యీ సంవత్సరము నూరేళ్లనాడు ఆరంభమయిన స్వాతంత్ర్యోద్యమమును, ఆ నాటినుండి యీ నాటివరకు జరిగిన వీరోచిత పోరాటమును, వివిధసంఘటన సన్నివేశాలను, భారతప్రజానీకం స్వీయస్వాతంత్ర్యసిద్ధికి చేసిన త్యాగములను స్మరించుటకుగాను యీ నెల 15, 16 తేదిలు నిర్ణయించబడి దేశం మొత్తం ఉత్సవములు జరుపుచుండుట సంతోషింప తగిన విషయము.

మనకు స్వాతంత్ర్యము సిద్ధించి పదిసంవత్సరములయినది. గత నూరేళ్ల స్వాతంత్ర్యోద్యమంలో ఆ బాల గోపాలము నిర్వహించినపాత్ర, చేసిన త్యాగములు దేనినైతే యుద్దేశించినవో స్వాతంత్ర్యసిద్ధి యనంతరము జాతీయ నాయకత్వము వానిని ఎంతవరకు సాధించినది పారజూచుకొనవలసి యున్నది.

స్వాతంత్ర్య పోరాటోద్దేశము ప్రజాశ్రేయస్సు. దానికి సంబంధించినవే అభ్యుదయ పురోభివృద్ధులు. జాతీయ శ్రేయస్సుతోబాటు స్వీయపురోభివృద్ధి నుద్దేశించి కృషిచేసి తన దైనిక ప్రధానావసరాలను సంపాదించుకోకలిగిననాడే సిద్ధించిన స్వాతంత్ర్యము సార్థక్యము చెందగలదు. నిరుద్యోగం ఒక ప్రక్క, ఆదాయము చెప్పుకోతగినంత పెరుగుదల లేకపోవడము మరొకప్రక్కయుండి అన్ని రకాల ఉత్పత్తులు పెరిగినవని వింటున్నా ధరలు తగ్గకపోవుటయేకాక సరసమైన ధరలకు మించి మితిమీరి పెరుగుదల స్థాయిలోనుండుటవలన సంవత్సరము గడచినకొలది సామాన్య ప్రజల ఆర్థిక దుస్థితి క్లిష్టమగుచున్నదేకాని ఆశాజనకంగాలేదు.

వాస్తవిక పరిస్థితుల నెదుర్కొనడానికి తగిన దృక్పథం అధికారంలోనున్న జాతీయ నాయకత్వమునకు ఉన్నదన సాహసించలేము. ప్రణాళికలు అభ్యుదయ పురోభివృద్ధుల కుద్దేశించినవే. అందుకుగాను ప్రజల సహకార సహాయములను సేకరించవలసినదే. కాని ప్రజల సహాయ సహకారముల సేకరణ పేరుతో ఉన్నదున్నట్లయినా నుండనీయక ప్రజల ఆర్థిక దుస్థితిని మరింత దుర్భరముచేయడము ప్రమాదము కాగలదు. పదేళ్లలో సాధింప తలపెట్టిన అభివృద్ధి, అభ్యుదయ కార్యక్రమాలను ప్రజల అసంతృప్తితో సాధించుటకంటె ప్రజల సద్భావ, సహాయ సహకారములతో యిరవై ఏళ్లకు సాధించినా మెరుగనిపించుకోకలదు.

తక్షణ సమస్యలను గుర్తించలేని ఏ నాయకత్వమైనా ఏనాటికో ఒరగబెడతామనే శుష్కవాగ్దానములతో ప్రజాదరణకు పాత్రముకాలేదు. గడచిన నూరేళ్లుగా ప్రజాశ్రేయస్సు నుద్దేశించి ఏఏ ప్రణాళికలను ప్రజలముందుబెట్టి జాతీయ శక్తులను సంఘటిత పరచకలిగారో వానిని విస్మరించి, తమమార్గాలను మార్చుకోడం జాతీయ నాయకత్వమునకే ఆత్మవంచన. గాంధీజీ నాయకత్వము, ప్రణాళికలు, బోధనలు ఒకప్పుడు విశిష్టమైనవియై ప్రజాహితమునకు మార్గములైతే యీ నాడు వానిని పాతపురాణంగా భావించిన ఫలితం?

స్వాతంత్ర్యోత్సవాలు దీర్ఘోపన్యాసాలు, ఊరేగింపులు, విందులు, సభలు, సమావేశములతో జరిగితేచాలదు. మనశ్రేయస్సు నుద్దేశించి, వీరోచితంగాపోరాడి అఖండ త్యాగములుచేసినవారి ఉద్దేశలక్ష్యాలు, చిత్తశుద్ధి, త్యాగసేవాసక్తి మనలో నెంతవరకున్నవో ఆత్మపరిశీలన చేసికొనవలసియున్నది. అధికార, అనధి

కార సభ్యులు తాము నిర్వహిస్తున్న ధర్మాలు ప్రజాహితము నెంతవరకు ప్రోత్సహించుచున్నది పారజూచుకోవాలి.

గత నూరేళ్ల స్వాతంత్ర్య పోరాటంలో మన శ్రేయస్సుపట్ల ఆరాటంతో ఆత్మార్పణమునకు సయితము వెనుదీయని వీరులకు యీ సందర్భమున కృతజ్ఞతా పూర్వకంగా భక్త్యాంజలి ఘటించవలసియున్నది. వారి ఉద్దేశలక్ష్యాల ననుసరించి ప్రజల శ్రేయోపురోభివృద్ధులను, తద్వారా జాతీయ, అంతర్జాతీయ రంగాలలో మనదేశం యొక్క, జాతీయొక్క కీర్తిప్రతిష్టలను ప్రోత్సహించుటకు దీక్షాకంకణులు కావలెను.

స్వీయపురోభివృద్ధితోపాటు ప్రపంచ సౌభాగ్యమును సయితము ప్రోత్సహించగల నాయకత్వము పటిష్టమైన దేశాక ప్రజాదరాభిమానములకు పాత్రముకాగలదు. అట్టి దానిని ప్రబోధించినదే 'గాంధీజి నాయకత్వము, బోధనలును.'

---

# సంజ వెన్నెల

## శ్రీ వివేకానందరావ్ (గౌతమ)

పుచ్చపువ్వులా
కన్నెనవ్వులా
పెదవులం తాకిన
అవధులు దాటిన
అనురాగపుటలలలా
విరజిమ్మిన విరులలా
ఆకస మంతట పర్వెందాక
వింతకాంతి !
ప్రణయదేవతరాక
ప్రేమగాలులంసోక
మనసులు కలసిన
వయసులం తెలిసిన
కేరాణుల్లా
పరాగ రేణుల్లా
ఆకసమంతట పర్వెందాక
వింతకాంతి !
ప్రేమచకోరాలం

ప్రియమారవిలియ
మొయిలం తోడను
చెలినికలియగ
కదలిసాగే
చంద్రునిరాకతో
ఆకసమంతట పర్వెందాక
వింతకాంతి !
రజనికన్నియ
విరహమందుచు
రహింఃదోలంగగ
రేరాజురాకకు
అభ్రవీధిలో
చకోరంబులం
ఆలపించెను
అమరగానం
అందజేసెను
చంద్రురాకను

వింతమూడ్కుల
వింతకాంతుల
వింతశోభల
వంతదోలగగ
వదనమంతయు
వేయికన్నెల
క్రొత్తవన్నెతో
విరియఃబూచిన
బొండుమల్లెల, జాజిగుత్తుల
మొగలిపొత్తుల
శోభతోడను
రజనికన్నియ
అరుణాధరంబుల
వెల్లివిరిసెను
మందహాసపు మరులంగొలిపే
సంజవెన్నెల !!

# తిప్పి పంపిన మనియార్డరు

'అర్జున్'



మాచమ్మ ఆ రోజు మధ్యాహ్నం మా మేనత్త వద్దకు రావడంతో ఏదో విశేషం వుందని ఊహించాను. ఆ వూరికి వేసవిలో కాలక్షేపంచేద్దామని వచ్చిన నాకు మాచమ్మ ఏలాంటిదో రెండవదినమే అర్థమైంది - నారదుడంతటిది.

వంటింటిలో గుసగుసలు వినిపించాయి. అందులో ఒకటి రెండు మాటలు 'సుశీల' 'మనియార్డర్' అని మట్టుకు నాకు వినిపించాయి. సుశీల ఎవరో, ఆ మనియార్డర్ ఏమిటో, మొదలు-కొస ఎక్కడా అందలేదు. చెవియొంచి అటువైపు విన్నాను.

"ఏంచెప్పేది వదినా! పోస్టు వీరన్న గుమ్మం దిగుతూనే చెప్పాడు - ఈ తడవగూడా మనియార్డర్ తన వద్దనుండి పుచ్చుకోడానికి ఒప్పుకోలేదట - ఆ విషయం గుప్పుమని వూర్లో అంతా ప్రాకింది. ఆ మనియార్డర్ చిన్నమొత్తమా ఏమన్నానా - వందరూపాయలు" అంది మాచమ్మ. సుశీల తిరస్కరించినందున తనకేదో వచ్చే లంకెబిందెలు తప్పిపోయినట్లు.

'అంతటితో పోలేదు వదినా! వీదంతా వకటే చర్చ! "వందరూపాయలే! తక్కువేంగాదు!" అన్నారు కొందరు. "కొంచంగూడా ఆలోచన లేదు. ఏదో కుర్రతనపు చేష్టలు" అన్నారు వయోవృద్ధులు "ఆవిడకు అది సక్రమమైన మార్గంకాదని చెప్పేవాడెవడులేడే!" అన్నారు సానుభూతిపరులు. "మనమాట వింటుందటయ్యా! వట్టి వెర్రి కోపిష్టి!" అన్నారు, చెప్పిన తమ సలహా పాటించలేదని ఉక్రోషంతో మరి కొందరు. "ఈ లాంటివి ఎన్నో విన్నాను. వినగలంగాని చేసేదేముంది." అంది మాచమ్మగారు. ఈ దఫా! వార్తలు మోయడంలో ఈ లాంటి వార్త మోసుకొచ్చింది. మరుసటి పది నిమిషాలు ఆ మాట ఈ మాట మాట్లాడి వెళ్ళింది.

అసలు విషయం ఏమిటో లీలగానైనా అర్థం గాలేదు. ఇంతవరకు 'సుశీల అనే ఆవిడ - నూరు రూపాయల మనియార్డరును త్రిప్పి పంపివేసిందని' అర్థమైంది.

గంట తరువాత నా వద్దకొచ్చింది అత్త.

చొరవచేసుకొని "అత్తయ్యా ఇంతకుముందు మీరు సుశీల మనియార్డర్ అని ఏదో చర్చ జరుపుతున్నారే! ఎవరావిడ! ఆ మనియార్డర్ కథేమిటి?"

"మనవూరిపిల్లే శాంతా! తల్లితండ్రిలేరు! ఎక్కడో విదేశంలో పెళ్ళాం బిడ్డలతో కాపురంవున్న అన్న ఒకడున్నాడు. వచ్చిన వందరూపాయలు ఆవిడ భర్తనుంచే!" "ఆవిడ భర్తనుంచా? అయితే ఆవిడ ఎందుకు తిరస్కరిస్తుంది?" "అదే ఎవరికీ తెలియదు. బ్రతకడానికి చాలా కష్టాలుపడుతూ కూడా ఆ డబ్బు తిరస్కరిస్తున్నది. ఆ దంపతుల మధ్య ఏదో పట్టింపువచ్చి వుండొచ్చు!" అంది అత్తయ్య. "అదిగాదత్తయ్యా! అలా చెప్పితే ఏలా చెప్పు! సుశీల ఎవరు! ఏమిటి?" "చాలా వివరం చెప్పవలసివుంటుంది శాంతా! సుశీల ప్రస్తుతం భర్తను విడిపించి-వచ్చి ఇక్కడవుంది. ఏకాకి-కొంతకాలం క్రిందట ఆవిడ అన్నగారు ఇక్కడికొచ్చి చూచి-తన వట్టిచేతులు చూపివెళ్ళాడు. ఆమె భర్త భాగ్యవంతుడు. లక్షాధికారట. అతనే భార్యకు ఆ వందరూపాయలు పంపిస్తున్నాడు. కాని ఏం ఫలం! సుశీల ఏమాసం పుచ్చుకొన్నదిలేదు. తిప్పి పంపుతూనేవుంది. తిప్పి పంపడానికి కారణం ఎవరికీ నికరంగా తెలియదు! ఈ వూరిలోవారందరు చెప్పేవి వారి ఊహాలు మాత్రమే! సుశీల బుద్ధిమంతురాలు! స్వయంశక్తిపై, తన కాళ్ళపై తాను నిలబడాలనే, ఆవిడ అభిప్రాయం. అందుకే మట్టు

మిషన్ తెప్పించి-పనిచేస్తున్నాడట” అని నిలిపింది అత్తయ్య!

అత్తయ్య మాటల్ని విన్నప్పటినుండి - ఆవిడ పరిచయంపొంది - ఆవిడతో కలిసిమెలిసేవుంటూ - ఆ నిర్భాగ్యురాలిచరిత్ర వినాలనిపించింది. ఆ లాటి ఆసక్తికలిగింది. సుశీల నోటిమీదుగా ఆవిడ స్వీయ చరిత్ర వినాలనేకోరిక బలవత్తరమైంది.

ఆ రోజు సాయంత్రం-వారింటికి వెళ్ళాను. తలుపులు వేసివున్నాయి. లోపల మిషన్ తిరుగుతున్న శబ్దంవినిపించింది. ధైర్యంచేసి తలుపుతట్టాను. సుశీల తలుపుతెరిచి ఆహ్వానించింది. ఆవిడలో మచ్చుకైనా ఆశ్చర్యంకనిపించలేదు. మర్యాదగానే ఆహ్వానించింది. చాపపరిచి కూర్చోమంది. తను మిషన్‌పై పని ప్రారంభించింది. తలుపు తెరవడానికిగా నిలిపిన మిషన్ తిరిగి తిరగడం ప్రారంభించింది. నేనే మా చుట్టరికం ఎరుకపరిచాను. ఆవిడా కలుగొపుతనంగా మాట్లాడింది. మాట్లాడుతున్న సమయంలో ధైర్యం చేసి నేనే అడిగాను “మీరు మనియార్డర్ని తిప్పి పంపుతున్నారట! అసలు విషయమేమిటో చెప్పండి?” అని.

“ఆ డబ్బును నేనెందుకు స్వీకరించాలి?” అని ఆవిడే ఎదురు ప్రశ్న వేసింది.

కొంచెంసేపు మా ఇద్దరి మధ్య నిశ్శబ్దం ఆవరించింది. కడకు నేనే “ఏం! ఎందుకు స్వీకరించకూడదు! అది మీ భర్తగారి డబ్బు! వారు మీ పోషణకు పంపుతున్నారేగా? అలాంటప్పుడు దాన్ని స్వీకరించడానికి అభ్యంతరంఏముంది చెప్పండి!”అన్నాను.

నా ప్రశ్నకు సమాధానం చెప్పడానికి బదులు - సుశీల బర్‌బర్‌మని మిషన్ని వేగం హెచ్చించి త్రిప్పింది. మిషన్ చక్రంలా ఆవిడ తలలో పూర్వపు స్మృతులు-గిర్రున తిరిగాయి. కొంచెం సేపటికి మిషన్ వేగం తగ్గించి “శాంతా! నేను చెప్పవలసింది చాలా పెద్ద కథ. ఈ దురదృష్టవంతురాలికథ వినిపించదగ్గది కాదు. చెప్పి నీ మనస్సు బాధ పెట్టడం మంచిది కాదని భావిస్తున్నాను!” అంది గద్గద కంఠంతో.

“మీరు మనస్సులో కలికినట్టుంటే చెప్పకండి సుశీలగారు! నిజంచెప్పితే నమ్ముతారోలేదో! మీ యొక్క కష్టాల్ని ఆత్రుతగావిని నిట్టూర్పు విడవడానికికాదు నేను వచ్చింది. మీకు ప్రాప్తించిన ఈ దురదృష్టాన్నిచూచి సానుభూతి తెలియజేద్దామనే నా కోరిక!” అన్నాను నేను.

“అయితే ఈ నిర్భాగ్యురాలిగాథ వింటారా” అని చెప్ప మొదలిడింది.

“నేను పుట్టిన కుటుంబం పెద్ద ఉన్నత వంశానికి చెందిందిగాదు. మా నాన్న సామాన్య గృహస్థుడు. కఠినదరిద్రులుకాకపోయినా ధనవంతులుగాదు. కాని నాకు వయస్సొచ్చి వివాహం చిత్రంగా జరిగింది. మా మేనమామకు సంఘంలోవుండే పలుకుబడి, దేముడి దయవల్ల అనుకోకుండా నాకు ధనవంతుడు, విద్యావంతుడైన భర్త లభించాడు. కానీ కట్నంలేకుండా, చదువుకున్నట్టి, లక్షాధికారి అయిన భర్త లభించడంతో మా నాన్న, అమ్మ బ్రహ్మరథం పట్టినంత ఆనందం అనుభవించారు.

మా వారు చాలా నెమ్మదస్తుడు, బుద్ధిమంతుడు. కాపరానికి వెళ్ళిన నాలుగు సంవత్సరాలవరకు - రాజభోగం అనుభవించాను. నేను దాహానికి నీళ్లడిగితే - ఆ యింట్లోవాళ్లు, మా వారు పాలందించేవారు. ఇంటిలోని వ్యక్తులందరూ, అనురాగాన్ని వెలిబుచ్చేవారు. కాని నాలుగు సంవత్సరాలు గడిచినా నా గర్భాన ఒక కాయ కాయకపోవడం ఇంటిలోని అత్తమామలికి నిరాశ కలుగజేసింది. నేనేం పాపంచేసానో - పిల్లలు కలగలేదు. చిన్న చిన్నగా వారి అనురాగం తగ్గిపోయింది.

ఇంట్లో-వాళ్లు అభిమానం చూపకపోయినా, మా వారు మటుకు అనురాగంతో పూర్వంలా వుండంతో ఎంతోసంతోషించాను. కాని నా సంతోషం కొన్ని నెలలలోఅంతమైంది. ఆ తరువాత మా వారుగూడా చీటికి మాటికి కోపగించుకోవడం - నేనంటే అయిష్టత

చూపసాగారు. ఏంచేసేది? కించా స్తిని పూరు కొన్నాను. దేవుని అనుగ్రహంలేదని మిన్నకున్నాను.

ఒక దినం సాయంత్రం మా వారు ఆఫీసునుండి అనుకున్న వేళకంటే ముందొచ్చారు. వారిలోమార్పు కలిగిందేమో అని సంతోషించాను. ఎన్నిదినాలకు అర్ధాంగి హృదయాన్ని అర్థం చేసుకొన్నారని వారిని నాలో నేనే పొగిడాను. పిల్లలు వుండడం లేక పోవడం మనచేతిలోని విషయంకాదు. మనంబాధ్యులం కాదని వారికీ తెలుసు - డాక్టర్లు చేయవలసిన పరీక్షలు చేశారని అందరికీ మా యింట్లోవారికి తెలిసిందే!

కాని మరో పదినిమిషాలకు నేనూహించిందంతా ఊహాకల్పనగానే నిలచిపోయింది. పరిస్థితులు తల్లక్రిందులుగా ఏర్పడ్డాయి.

ప్రేమగావారు "సుశీల" అని పిలిచి తన ఎదుట కూర్చునబెట్టి తను కుర్చి చేతులపై ఆనుకొని కూర్చొని ఏదో చెప్పాలనిప్రయత్నించారు. నిజంగా ఆప్రదేశం, ఆస్థితి నన్నువెర్రెత్తించింది. ఖైదిలాభావించాను.

వారు చిన్నగా మాట్లాడారు. అందులో సారాంశం - వారి నాన్నా అమ్మా, పిల్లలులేనందుకై మరల వివాహంచేసుకోమని చెప్పారట. అందుకు కారణం నేను గొడ్రాలుగావడమేనట. తాను వారికోరిక తీర్చ నిశ్చయించారట. తనకు సంతానం లేకుండా వుండడం ఇష్టంలేదట. తన సిరిసంపదలకు వారసుడు లేక వారసులు కావలసివుందని — చేసుకోదలచానని చెప్పారు!

అది విన్న నేను దానికిసరిఅయిన జబాబుగా 'అయితే మీకు మీధనం, మీ సంపదలు - మీ అర్ధాంగి అయిన నాకన్నా ముఖ్యమా! మీ సుఖదుఃఖాలలో భాగస్వామినిగానా?' అని అనాలనుకొన్నాను. కాని నిగ్రహించుకొని నోరుమెదపలేదు. కాని అశ్రుధారలను నిలుపలేకపోయాను. నాకన్నుల నుండి నీటిబొట్లు జలజలరాలాయి. దానివల్ల ఆయనలో చైతన్యం - తను చేస్తున్న అన్యాయం అర్థంచేసుకుంటారని అనుకున్నాను. కాని అందుకు బదులు నిలువెత్తున కోపంపుట్టుకు వచ్చింది "ఛీ! ఛీ! వెధవఏడుపు - నీవూ! మాకుటుంబం - పచ్చగా వుండడం నీకిష్టంలేదా! మన్నులోకలసిపోవాలనేనా నీ కోరిక! మానాన్న వాళ్లు ఈ ఇంటి మర్యాదలకు సుఖానికి చేసిన ప్రతిపాదనలకు ఏడుస్తావేం! ఒక్కటి మటుకు నీకు హామీయిస్తున్నాను. నేను మళ్లీ పెళ్లి చేసుకున్నా - నీకు ఏలాంటి అడ్డంకులుండవు. నీవు ఇక్కడే వుండవచ్చు. అందరితోపాటు అన్నీ అనుభవించవచ్చు! నిన్ను చిన్నచూపు చూచేవారుండరు!" అన్నారు మా వారు.

అంతటితో ఆ రోజు ముగిసింది. ఆ తరువాత నాల్గువదినం తాంబూలాలు పుచ్చుకొన్నట్లువిన్నాను ఒక్కసారి పరిస్థితుల్ని అవగాహనం చేసుకున్నాను.

ఆ యింటిలో - అనురాగాన్ని, ప్రేమని లెక్క చేయినట్టి, ఒకవిలువకట్టలేని ఆ యింటిలో వుండడం సుఖముగా తోచలేదు. కావలసింది ఆత్మగౌరవం.

మరుసోజు సాయంత్రం ఈ పల్లెకు ప్రయాణమైనాను. మా అత్తమామలు అడ్డగించలేదు. మా వారు మటుకు బండికట్టించి పంపారు. నా కాళ్లమీద నేను నిలబడదలచాను. అందుకే ఈ కుట్టు మిషన్-అదే నా యిలవేల్పు.

కాంతా! నన్ను, నాకోరికను! అనురాగాన్ని మన్నించనివారి, బంగారాన్ని డబ్బును నేను మన్నించాలా! దానిబదులు ఆకలిదప్పులతో అలమటించి చావచ్చు! అంది సుశీల. ఆమె విషాదగాథ నన్ను అశ్రుధారలు కార్పించింది. హృదయంలో ఏదో ఒక రకమైన అనుభూతి కలిగింది.

("ప్రియదర్శినీ" గుజరాతీ కథ ఆధారంగా)

# రాధ

శ్రీమతి పవని భ్రమరాంబ



రాధ మానవ దృష్టికి కేవలంవెర్రిది. ఆమెకీ మానవలోకం వెర్రిది. సృష్టినే అభినందిస్తుంది. ఆనందిస్తుంది. సృష్టిలోవుండే పవిత్రమహత్తర సందేశాన్ని పరిశీలించి పరామర్శించదలచింది.ఫలితం. అప్పుడామె హృదయమేనుమం నూతనమనోజ్ఞకోమలం. ఇప్పుడో ... కఠిన కర్కశపుశిల ... ఎంతమార్పు. కాలవైపరీత్యానికి కర్తలెవరు ...

పరువెత్తుచున్నది. చేరిందా మల్లెగుబురలను. సాయంకాలంమల్లెలు మనసుకల ప్రతిమానవుని హృదయ సౌధాన్ని మత్తు రంగుతో మెరిగిస్తున్నాయి.

“నా భావమల్లెల్లారా మళ్లీ పుష్పించారా ... ఏమాపరిమళము! ఆ నూత్న సోయగము! ఆ మానముద్రవలన మానవ హృదయాలకు ఎంతగంభీరభావాల్ని ప్రసాదిస్తున్నారు ....

అయ్యో నిన్నమీవలెనే తలలెత్తి తమ సౌందర్యభావాల్ని తదితరులకు ప్రసాదించిన ఆ కోమలభావ గర్భితకుసుమములు ప్రచండభాస్కరుని ప్రజ్వల, కిరణాగ్నిహోత్రాలకు తాళజాలక మాడిమంటిపాలైనవి రాధ - ఆవేదన ... కళ్లవెంబడి నీళ్లురాలుతున్నాయి.“మరలరేపు” గిర్రున తిరిగి వెళ్లి పోయింది.

కౌముది కౌగిట్లోకి కప్పించిన ప్రపంచం కావురానికివచ్చింది. ఆ కాంతులకు సెలయేరు దాని పరిసరాలు వింతరంగులతో మెరుస్తున్నాయి. అదృశ్యసౌందర్యం అవలోకించి ఆనందించుట అప్రయత్నంగా లభ్యమవుతుందా ...

ఆసెలయేటిగాన నైపుణికి తన కేకలు శృతిచేస్తూచేరిందా చేడి సెలయేటిని. ఎవరోకాదు-మతిలేని మనరాధ,వికృతంగా నవ్వు ... “దీనికేనానీకింతగర్వం మానవ పశుపక్ష్యాదులు నీవులేకపోతే నశిస్తాయని సృష్టిలో గొప్పదాన్ననికదూ. ఉహూ! పాపం, నీకునయాల్ని ప్రసాదించుంటే నీపరిసరాల్ని చూచయునా గర్వోపశమనంచేసుకొనేదానివేమో.”

ఆ తీరాన్నే నడుస్తుంది. ఇసుకతిన్నె వెనుక ఇద్దరువ్యక్తులు. ఒకముదుసలి, పదునారేడులబాలుడు - గురుశిష్యులు. ప్రపంచానుభవాల్ని భోదిస్తున్నాడు శిష్యునికి. పోతుంది కేకలువేస్తూ దారినిదాటి. వెనుదిరిగి చేరింది వారిని. గురువుపెదవుల మీదమందహాసం, చేష్టలు దక్కిచూస్తున్నాడా బాలుడుమాత్రం.

"లోకం కంటకప్రాయం ... దాంతో నాకు నిమిత్తంలేదు. మీరుదానికి సంబంధించినవారేలేండి, వెళ్లిపోండి. నాకు కోపం అసహ్యంకలిగిస్తున్నారు. పలకరేం! నన్నే వెళ్ళమంటున్నారుకదూ!"

పకపక నవ్వుతూ దోసెడు మన్ను తీసింది. రెండశ్రువులు రాల్చి మరలమన్ను మంటిలోకలిపింది.... మందహాసం చేసి చరచరా వెళ్లిపోయింది.

గురువునయనాలు మాత్రం పూర్వ దృష్టితో అర్థంచేసికొన్నట్లు రెండశ్రుబిందువులురాల్చాయి.

విస్మయనేత్రాలతో ఆమె వెళ్లేబాటను తిలకిస్తున్నాడా బాలుడు మాత్రం. చూస్తున్నాడు ఇంకా చూస్తున్నాడు ... మరీ, చూస్తున్నాడు అర్థంచేసికోనేందు కసమర్థుడౌతున్నాడా పడుచుని, "ఆమె వెఱ్ఱిదా?" ఆనేప్రశ్న అతని హృదయాన్ని తొలుస్తున్నది. ఆవేదనగాగురువు వంకచూస్తాడు. "ఏంటినాయనా నీ సంశయం?" ప్రశ్నిస్తాడు గురువు, "ఆమె వెర్రిదా బాబా?" నిట్టూరుస్తాడు గురువు. "హుం, వెర్రిది సత్యాన్వేషణలో జీవితార్పణ చేసిన అభాగిని-అర్థంచేసికోలేని అల్పప్రపంచానికి ఆమె వెర్రిది - అదొక విషాదగాథ" "ఏంటి బాబా ఆ విషాదగాథ?"

"వినాలని కుతూహలంగా వుందా ... అలాగయితే విను".......

"అదిఒక పల్లె. ఆమె తండ్రి గ్రామాధికారి. అందరికి ఆదర్శకుటుంబం. సదాచారసంపన్నుడయిన సాంబమూర్తికిచాలా కాలం సంతానంలేక చిట్టచివరన ఈమె జన్మించి రాధా నామధేయంవహించింది. ఆదంపతుల మురిపెపుకోమరితె రాధ అల్లారుముద్దుగా పెంపబడుతోంది .... అలాగే...

కాలశకటంకదలుతోంది జీవత చక్రాలుతిరుగుతున్నయి. వాటివేగాని కెవరు అడ్డు తగిలి ఆపగలరు.

రాధకు పండ్రెండవ సంవత్సరం ప్రవేశించింది. యవ్వనారంభం, వచ్చీరాని జ్ఞానం, సంస్కృత విద్యాభ్యాసం చేస్తోంది.

అప్పుడు సాంబమూర్తులు రాధావివాహానికై తగు ప్రయత్నాలు నెరపటం మొదలెట్టారు. తల్లి కుమార్తెను హెచ్చరిస్తోంది అప్పుడప్పుడు. ఎందుకో లేనిపోని ఈ జిజ్ఞాస. "వివాహమట."

"రాధా నీ వివాహంకొరకు బాబయ్యా నేను ఎలా తంటాలుపడుతున్నామో ... ఆ సర్వేశ్వరుడు మనయందుంటే మా రాధకు మంచిభర్త లభిస్తాడు" అని మురిసింది తల్లి.

"అమ్మా అప్పుడే వివాహంచేసికొని ఏంచేయాలి సంస్కృతం చదువుకుంటుండరాదా".

(సశేషము)

# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం :
డాక్టరు W. రాధాకృష్ణయ్య



[ఉత్తర కాశీక్షేత్రవాసులైన పూజ్యపాద శ్రీ చిన్మయానందస్వాముల వారు 9-5-1954 నుండి 29-5-1954 వరకు కోయంబత్తూరునందు ఉపనిషద్ జ్ఞానయజ్ఞమను పేర కేనోపనిషదునుగూర్చి యొసంగిన ఉపన్యాసములకు అనువాదము.]

## ఉపనిషదు విచారమునకు ఉపోద్ఘాతము
## మనము బంధువులుగా యుందుముగాక:-

ప్రపంచములో ప్రస్తుతము, మానవుని మర్యాద, నీతి, విజ్ఞానములు అధోగతి జెందియుండు సమయము: మనము మన మతమునుకూడా దురీకరించినయెడల మన నాశనము త్వరలోనే పొందుట నిజము. మన మతము యెంత పాతపడినదైననూ, యేమతమును లేక యుండుటకంటె దానిని వదలక అవలంభించియుండుట యెంతో మేలు. ఆ మతము నూతనమార్పులను కల్పించి దానికి కళాకీర్తులు కలిగించ ప్రయత్నించుట చాలా మెచ్చదగినపని. అందువల్ల మన మతము పూర్వకాలములో పొందిన ఔన్నత్యమును విజ్ఞానమున, నాగరికతమున దానికి మరల సమకూర్చిన వారమగుదుము.

హిందూదేశములో ప్రస్తుతము, హిందూమతము అని తెల్పునపుడు ఆ మతస్థులు యేదో కొన్ని వాడుకలో యుంచుకొన్న వస్త్రధారణ, భోజన విధానము, సమారాదన, మాటలదోరణి వీటియందుండు ప్రత్యేకతను బట్టీ హిందూవులని తలచుచున్నారు. మన దేవతలు, మతగురువులు, కానుకల చెల్లింపుతో భక్తుల ప్రార్థనలను సమకూర్చువారైయున్నారు. అందును కానుకలు సమర్పించుట ముఖ్యసాధనమైయున్నది.

ఈ నీచస్థితి యేదో ఒక అకస్మాత్తు సంఘటనవల్లగానీ, ఏక్షణిక సంఘవ్యవహారిక పొరపాటువల్లగానీ, కలిగినదిగాదు; వేలకొలది సంవత్సరములుగా హిందూమతము రాజపోషణము, ధనికుల యభిమానము పొందక అనాథయైనది. ఒకానొక కాలమున వేదాంత విజ్ఞాన పురుషులచే రాజ్యాంగము నడుపబడుచుండెను. అట్టి రాజ్యము చక్కగ నడుపబడుచుండెను. కాలేన రాజులు, రాజ్యనీతి పరిపాలకులు, ధనపౌరుష మదాంధులై విజ్ఞానము క్షీణించి తీరని మహారోగపీడితులై ఇప్పటి నీచస్తితికి వచ్చి నిల్చిరి. నాగరిక విద్యావంతులు ఇప్పుడుచేయు ఆందోళన ఈ విపరీత మతదోష నివారణకై ప్రబలుచున్నది.

హిందూమతము ఒక పరిపక్వ విజ్ఞానకళ. హిందూమతములో మనము విచారించి, పొంది అనుభవించగల యొక గొప్ప శక్తి యున్నది. మన వ్యక్తిగత, సాంఘీక, జాతీయ, అంతరజాతీయ సమస్యల కన్నిటికినీ ఇందుతగు సమాధానములు చూపబడియున్నవి. ఇతరుల బోధవల్ల మనము పొందిన అనుమానములు తప్పుడు అభిప్రాయములు, మన మత గ్రంథములలో కానరావు. "హిందూమతము" అనిన అది వేదాంత మతము శాశ్వత ఉపనిషన్మతము.

ఉపనిషదులు శాశ్వతముగా "మానవుడు తన

వున్నత స్థితియందు తానే స్వయముగా భగవంతుడు” అని ఉద్ఘోషించుచున్నవి. మానవుడు తన నడవడులలో ప్రతిదినము ప్రతిక్షణము తీక్ష్ణవివేకపరిశీలనవల్ల తనకు ఆవరించుకొనియున్న లోపములను దుర్గుణములను తొలగించ ప్రయత్నించుచు తనలోనున్న శోభాయమాన ఆనందదైవ స్వరూపమును వెలిబుచ్చ ప్రయత్నించవలెనని బోధించుచున్నది. మానవుడు జ్ఞానపూర్వకముగా స్వప్రయత్నముచేత తనకు తాను పరిశుద్ధతనుపొంది తన నిత్య, సత్య స్వరూపమును పునఃపొందగలడో ఆ విధానము తెల్పునది హిందూ మతము. హిందూమతము తన విశాల ఆవరణములో పవిత్రమైన సత్యస్వరూప దేవాలయమును స్థాపించి పురాణములు, ఇతిహాసములు, శాస్త్రములు మొదలగు వేలకొలది సిద్ధాంతములతోను నమ్మకములతోను దేవాలయమును రక్షించి పూజా విధానములను యేర్పాటుచేసియున్నది. ఈ శాస్త్ర పురాణముల విజృంభణ మితిమీరగా ఆ చిన్న సత్యస్వరూప దేవాలయమును కప్పుకొని మరుగుపరచియుండు దురవస్థవల్ల మన నవనాగరిక విద్యార్థులు పురాణ సంస్కృత భాషా పరిజ్ఞానము లేకపోవుటచేత ఆ దేవాలయ స్వరూపమే కనుగొనలేక పోవుచున్నారు.

ఆ సంస్కృతశాస్త్ర మూలగ్రంథములను పరిశోధించి, హిందూమత మనగానేమి? దానియొక్క ఉపదేశములు మన దినచర్యలతో ఎట్లు తోడ్పడుచున్నదో కనుగొనుచు మన జీవిత సమస్యలు వాటివల్ల ఎట్లు మార్పుచెందగలవో కనుగొనుటయే ఈ ఉపనిషద్ జ్ఞానయజ్ఞముయొక్క ముఖ్య యుద్దేశ్యము.

మతావలంభకులు మతములో తెలిపిన ప్రీతిపూర్వక సదుద్దేశ్యములను కృతజ్ఞతతో జీవితమున అవలంభింపకపోయినయెడల ఆ మతము నిష్ప్రయోజనము. అంతేల-యేవుద్దేశ్యమునైననూసరే రాజకీయ, సాంఘిక, వైజ్ఞానిక బోధలుకానీ వాటిని అవలంభింపకపోయినయెడల వాటిలో తెల్పిన ఆనందము ఫలముపొందుటలేదు.

## మనము జీవితమును అనుభవించవలెను-

చరిత్రయందు పూర్వకాలపు హిందూదేశము వైజ్ఞానికముగా బహు గొప్ప పదవిని పొందియుండెనని తెలిపియుండినంత మాత్రమున మన ప్రస్తుత సంఘటనలకు అది ఎంత మాత్రమును తోడ్పడజాలదు. ఆఫ్రికా యడారులలో నివశించు వన్యజాతి మానవులు ఇతరదేశీయుల నాగరికతను అనుభవించవలెననిన నాగరికతను గురించి వుపన్యాసములు వినుటవల్లను, నాగరికతను గురించి గ్రంధపరిశీలనవల్లనున్ను అనుభవింపలేరు. వారు నాగరికతను గురించి తెలుసుకొని ఆ రీతి జీవిత నడకను సాగించవలెను. తెలిసినంత మాత్రమున ప్రయోజనములేదు. వారు పొందకోరిన ఫలము జీవితనడవడికవల్లనే పొందనగును. నాగరికజనులై నివశించుటకు, వారి వన్యగుణములను తదనుసరముగ చింతించుటయును విడువవలెను.

నిజముగా వేనినో ఒక దానిని త్యజించక ముందు సాగుట సాధ్యపడదు. మనము మన బాల్యశేష్టలను వదలకనే గౌరవనీయ యువకులగుచున్నాము. యౌవనములోని వుద్రేకములు వదలిననే వార్థక్యము యొక్క గౌరవమును పొందుచున్నాము.

మన నీచప్రగ దోషములను వదలి ధనాశను పోద్రోలి, వాటి స్థానమున గొప్ప సత్యగుణములను నెలకొల్పిననే మనము మన మతముయొక్క ఆశీర్వాదములకు పాత్రులమగుచున్నాము. పాక శాస్త్రమును ఎంత స్పుటమున పఠించిననూ మన ఆకలి తీరజాలదు. ఔషధముయొక్క పేర్లు యెన్నిమార్లు జపించిననూ దానిని సేవించనిదే రోగము తీరదు. ఔషధము సేవించిననే రోగనివారణ గలుగును. అటులనే మత బోధవల్ల రాగల సత్యగుణములను మన జీవితమున అనుసరించిననే మతమునందలి ప్రశాంతపదవి మనకు చేకూరగలదు.

ప్రతిరోజు మతమునందలి శాశ్వతానందపరమపదవిని కనుగొనుటకు ప్రతిమానవునికి ఈ స్వల్పకాల మానవ జన్మ జీవితపరిమితిలోనే సాధ్యము. ఉపనిషదులలో

ఘోషించబడిన సత్యమార్గముల పరిశీలనవల్ల మన మతమునందలి నానావిధ సంస్థల స్థాపనలు నియామక ముల వైజ్ఞానిక ప్రాముఖ్యత మనము కనుగొనగలము. ఈ విచారముయొక్క చివరన హిందూమతముయొక్క పరిపూర్ణత్వమును మనము కనుగొనగలము.

హిందూమతము అనిన యేమియో మనము ముందు కనుగొనవలెను. మనము మనకొరకేగాక సర్వమానవ ప్రపంచ క్షేమముకొరకు మనము యీ హిందూమత మున కనుగొనగల గొప్ప సత్యమును సాధ్యమైనంత వరకూ మన జీవితచర్యయందు అనుసరించ సంసిద్ధు లగుచున్నామని తీవ్రప్రతిజ్ఞ చేసెదముగాక. ఈ మతముయొక్క పురాతనము, పూజ్యతరమైన విలువ దానియందు నెలకొల్పుదుముగాక.

## మతమనగానేమి ?

మతము మానవునియొక్క ప్రత్యేక హక్కు. మృగములకు దీని సంపర్కములేదు. మృగజీవిత మంతయు తినుట, నిద్రించుట, సంతానముకలిగించుట, వీటితో జన్మక్రమము చుట్టుచుండును. మనుజునికి ఆహారము, నీడ, వస్త్రాలంకరణ, వినోద క్రీడలతో తృప్తి సమకూడుటలేదు.

ఈ ఆహారము నీడ, వస్త్రాలంకరణ, వినోద క్రీడలు తాను పొందునంతవరకూ అతడు ప్రయత్న పూర్వక ముగా వీటిని సంపాదించ యత్నించుట నిజమే. ఇవి కూడిన వెనుక తీరుబాటుగా కూర్చున్నపుడు తన అంతరమున సంశయములు బయలుదేరుచుండుట అతడు కనుగొనగలడు.

మఱి యీ అంతర సంశయములు జీవునియొక్క సూక్ష్మ ఆందోళన పరిపూర్ణ మానవునకే కలుగు చుండును. మనుష్యులలోకూడా మృగప్రాయు లున్నారు. వ్యాఘ్రములు, వృకములు, (జింక) పాములు, తేళ్లు ఇట్టి నీచస్థితిలోనున్న మానవులకు ఈ హృదయ ఆందోళన యవసరములేదు.

పరిపూర్ణ మానవత్వమును పొందిన వ్యక్తికి సద సర్వకాలములోను తన హృదయమును సంశయము ముంచుచుండును. ఇట్టి ఆందోళనా అలజడిలో అతడు జీవునియొక్క మహాత్యము జీవితములో ఎట్లు సంబంధపడియున్నదో విచారించి ఆశ్చర్యనిమగ్ను డగుచున్నాడు. నేను యెచ్చటినుండి వచ్చితిని ! నేను ఎచ్చటికి వెళ్ళుచున్నాను ? నేడో రేపో వెళ్లుట తప్పదుగదా ? ఎందుకు నేను వచ్చినాను ! ఈ జీవితమంతయు ఒక అర్థములేని శూన్య వ్యాప హారమా ? జీవితమున ఒక నియామకమువున్నదా ! జీవితమున ఒక సందేశము యేర్పాటైయున్నదా ?

ఏ వ్యక్తి తన ప్రతిదినచర్యను జ్ఞానరీత్యా విమ ర్శించి ప్రతిసంఘటనమునందు తీక్షణ విచక్షణ చూపుచున్నాడో అటువంటి పూర్ణమానవవ్యక్తికి పరిపక్వదశవల్ల యిట్టి ఆందోళన కల్గుగుట సహజము. మతబోధలంతయు అటువంటివారికే చెప్పబడి యున్నవి. మతము భోదపరచి నమ్మకము కలిగించి మార్గము చూపుచుండును. మన దినచర్యలలోగల కేవలం తినుట, త్రాగుట, నిద్రించుట, నవ్వుట, ఏడ్చుట వీటిని మించిన ఒక గొప్ప దివ్య సందేశ మున్నదని మనకు తెలియుచున్నది.

ప్రతి ఋజుమతమునందును రెండు ముఖ్యాంశము లుండును. పూజాక్రమము ఒకటి, వేదాంత విజ్ఞాన సూచనలు రెండవది.

మనలో చాలా మందికి మత మనగా ఈ మొదటి అంశములో (పూజాక్రమము) పరిపూర్ణమగుచున్నదని అభిప్రాయము నెలకొనియున్నది. అయితే వేదాంత విజ్ఞాన భోదలులేని కేవల పూజాక్రమ మతము గ్రుడ్డి మతము. మతావలంభనాచారములేని విజ్ఞానబోధ వట్టి వెఱ్ఱితనము. రెండునూ కలసి మెలసి యుండ వలయును. వేదాంత విజ్ఞానబోధలు మతమునందుండు ప్రార్థన పూజాక్రమ పద్దతులకు సరియగు వుపయోగ ములు, ప్రయోజనములు తెలుపుచుండును. రెండును పూర్తిగా కలిసిన మతముయొక్క పూర్తి ప్రాముఖ్యత వెల్లడికాగలదు.

మతము పూర్తిగా విమర్శించినయెడల జీవిత గమ్యస్థానము, దానియొక్క గుణములు అందుకు చేయగల పూజా ప్రార్థనా విధానక్రమములు, అనుసరించువిధులు, అన్ని తరగతుల మానవులకు తగుతగు రీతి తెలుపబడియున్నది. వారు తమ తమ ప్రస్తుత స్థితినుండి ఆ తెలుపబడిన జీవిత గమ్యస్థానము చేరుటకు చేయవలసిన కార్యక్రమములు తెలుపబడియున్నవి.

మతముల కన్నిటిలోను వేదాంత మతము సత్యమునుగూర్చి పూర్తిగా విచారించి విచారముయొక్క సారముగా గొప్ప ఋషులయొక్క అనుభవములను తెలుపుచు, ఆ సత్య స్వరూపుడు మానవునిలో నెలకొనియున్నాడనియు మానవుడు తనకు ఆవరించుకొనియుండు అజ్ఞాన దోష గుణములను ప్రయత్న పూర్వకముగా తొలగించుటవల్ల తన నిజస్వరూపమును శాశ్వత అఖండ ఆనందస్వరూపమును పునఃప్రాప్తి పొందగలడు అని తెలుపుచున్నది. ప్రతి ఋజు మతమును అజ్ఞాన ఆందోళనలో మునిగియున్న మానవునికి తనయొక్క బంధవిముక్తికై యువ్విళ్లూరు మానవునికి తగు సమాధానము తృప్తి ఆనందమును ఇచ్చుచున్నది.

## అంధకారమున:-

ఉదాహరణమునకు ఒక మనుజుడు తాత్కాలికముగా మతి భ్రమతో మేడమీద కూర్చునియున్నాడు. అస్తమానమైనది. చీకటి ఆవరించియున్నది. చలికాల రాత్రి ఆరంభమగుచున్నది. భరింపరాని ఆ చలికి తన్ను గమనించువారు లేరేయని ఖిన్నుడగుచున్నాడు. దుఃఖపడుచున్నాడు. నిశ్శక్తుడగుచున్నాడు. బాధ, దుఃఖము పెరుగుచున్నది. అతనికి రెండడుగులు వెనుక కూటముయొక్క కిటికీ తెరచియున్నది. క్రిందనున్న తన సుందర భవనమును చూడవచ్చును. అతని శయ్య అమర్పబడియున్నది. భోజనము తయారుగానున్నది. అతని సతీమణి అపేక్షతో అతని రాకకు ఎదురు చూచుచున్నది. అతడు వెనుక తిరిగిచూచినంత మాత్రమున తన స్వంత ఆనందదాయక సౌఖ్యమొనగూర్చగల గృహము స్వతఃసిద్ధమైయున్నది. తలంచినంత మాత్రమున దానిని అనుభవింపగలవాడై యున్నాడు. కానీ చూచుటలేదు ! అదేరీతి మానవుడు తన జీవిత మేడమీదనిలచి బాహ్యదృష్టితో ప్రపంచ దృశ్యములనబడు చీకట్లనుచూచి భ్రమయను చలిరాత్రిలో ఏకైకుడను విలాపము పొందుచున్నాడు. తన స్వంత మతము ప్రేమతో "లోదృష్టి పొందు"మని వేడుచున్నది. మతము మేడమీద కష్టము వదలమని లోనప్రవేశింపమని ప్రభోదించుచున్నది. "మేడను వదలుము" "ప్రకాశించు లోభవనమును ప్రవేశింపుము. నీ సౌఖ్యము నేనొనగూర్చెదన"ని ఘోషించుచున్నది. వెఱ్ఱిగృహస్థుడు వినిపించుకొనుటలేదు. సంసారినని కష్టపడుచున్నాడు.

లోపునకు మరలిన జాలరు. ప్రస్తుతము మన దృష్టియంతయు బాహ్యమున ప్రచురించి బాహ్యవస్తు సముదాయములవల్ల ఆనందము కోరుచున్నాము. కనుకనే ఆ యానందము పొందలేకపోవుచున్నాము. నాశనము, అంతము లేని శాశ్వతసుఖమును ఈ అశాశ్వత పరిమితికిలోనైన వస్తుసముదాయములు యివ్వజాలవు. పరిపూర్ణ ఆనందశాంతము బైటదొరకజాలవు. మన హృదయముననే అది పొందనగును. "చక్కగ వెనుకకు తిరిగి లోదృష్టి పొందుడు. మీరు కోరుపదవి సమక్షమున నిలచియుండుట కనుకొనగలరు." అని అన్ని గొప్ప మతములు బోధించుచున్నవి. యీ మాట సత్యమని మన గొప్ప ఋషి పుంగవులు మహాత్ములు నమ్మకమిచ్చియున్నారు.

బాహ్య ఇంద్రియగోచరవస్తు సముదాయములలో నిజమైన ఆనందములేదు. కొన్ని కొన్ని సమయములలో అవికొంత ఆనందము కలిగించునట్లు మనకు తోచుచున్నది. కానీ యీ అల్పఆనందము మలిన సంపర్కము పొంది కల్మషమై విసుగుచెందుచున్నది. ప్రతిసంఘటనమునందును, దుఃఖలేశము మిశ్రమైయుండుట మన అనుభవములో కన్గొనుచున్నాము. మత బోధలు యీ భాహ్యవస్తు సముదాయ, గుణములలోగానీ, వాటి నియామకములలోగానీ మార్పు గల్గింప ప్రయత్నించుటలేదు. ప్రపంచము తన స్వభా

వమునువిడువదు. కాలపరిణామమార్పులు ఆనియామ కుని ఆజ్ఞరీతి జరుగుచునేయుండును. మతము తన సంతతికి జీవితమును ధైర్యముతో ఎదుర్కొన సాహసము కలిగించుచున్నది; శక్తికలిగించుచున్నది. నీతి, సమత్వమున్ను, ప్రశాంత జీవితమున్ను కలిగించుచున్నది.

## జీవితము = అనుభవముల పరంపర:-

బాహ్యప్రపంచ వస్తుసముదాయము, ఒకరీతిగా యున్ననూ, వాటివల్ల కలుగు అనుభవములు, వివిధ వ్యక్తులకు వివిధరూపములుగా నున్నవి. ఒక తల్లి, తండ్రి, ఇరువురు పుత్రులు ఒకేగృహమున నివశించుచున్నారు. వారందరు ఒకే ఆహారమును భుజించుచున్నారు. ఒకేవంటపాకము. ఒకేరేడియోను వినుచున్నారు. ఒకేపంకాక్రింద కూర్చుని కాలయాపనము, వివిధరీతులగడుపుచున్నారు. మాటలు, పాటలు, అన్ని జరుగుచున్నవి. ఇట్లువున్నను ఒక భానువారము మద్యాహ్నమున వారి అనుభవములు ఎట్లున్నవి? అందరి మనమున అనుభవములు ఒకేరీతి లేవని తెలియుచున్నవి.

ఇట్లు వస్తు సముదాయము యేకరీతినున్నను, వివిధ మానవులలో వాటి అనుభవములు వివిధ రీతులుండుటకు కారణమేమి? ఎల్లరకు ఒకేరీతి అనుభవము కలుగుట సాధ్యమా? అనుభవము అనినయేమియో మొదలు తెలిసికొందుము. ఒకస్థలములో, ఒక కాలమునందు మనమనస్సు, బుద్ధి, వస్తుసముదాయము వల్ల పొందు, బింబమును, బింబమువల్ల బుద్ధిలో కలుగుమార్పు ఒకేవస్తువు వేరు వేరు సమయములలో వేరు వేరు స్థలములలో, వేరు వేరు పరిసరములలో, కూడినపుడు మనస్సుకు వివిధ అనుభవములను, కలిగించకలుగుచున్నది. వీటికంతకు ఆవశ్యకమైనది, మన మనసు. విషయ సంపర్కమువల్ల చెందుచుండు, ఆవశ్యకమైన సంఘటనము ఆమనసు పాల్గొనకపోయిన, అనుభవముకలుగుట లేదు.

ప్రపంచములో వస్తుసముదాయములు యెల్లప్పుడు ఉండినను, అవి మానవశక్తికిమీరిన శక్తికిలోబడి, వ్యవహరించుచుండును. కానీ మనకు అనుభవము కలుగువలెనన్న, వస్తువులు మనపై ఆకర్షణపొంది వ్యవహరించవలెను.

కాబట్టి మనస్సునకు, ఎల్లపుడు ఎట్టి సముదాయముపై ఆకర్షణ చెందినను, ఆమనమున సాత్వికమార్పు ఒకటే కలుగునటుల అలవాటు పొందిన, మనకు ఎల్లప్పుడును, సాత్విక అనుభవముతే ఏర్పడగలవు. ఏ మానవుడైతే ఇటుల తనమనసు సర్వాకాల సర్వావస్థలయందును, సాత్వికమార్పుతే పొందునట్లు తయారుచేసుకొనియున్నాడో, అతనిదే శాంతము, ఆనందము. బాహ్యప్రపంచము ఎల్లప్పుడు ఒకటిగనేయుండుటవల్ల ఈ పరిమితికిలోనైన, దుఃఖరాశియైన ప్రపంచమున ఎడతెగని శాశ్వత ఆనందము, సంతృప్తి మనము అనుభవించగలము. మనము యీ ప్రపంచమునకు దూరమై, నిర్భయులమై బాహ్యమునకలుగు, ఆశాపాశతుపానులను, సాక్షిభావముతో గమనించగలశక్తి పొందగలము. బంధరహితులమై సాక్షివలె మన దుఃఖములను, వ్యసనములను, గమనించగలము.

(సశేషము)



# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు.



(గత సంచిక తరువాయి)

౧

శ్రీవత్స చిహ్నంబుచేఁ బ్రకాశించెడి
శ్రీరామచంద్ర! సౌశీల్య సాంద్ర!
భాను వంశాబ్ధిలోఁ బ్రభవించి వెలుగొందు
కౌసుభమణివీవు! కమలనయన!
లక్ష్మి కరంబులౌ, రత్నహారంబుల
వక్షస్థలమునందుఁ బడసినావు
హాడ, సురగణము, లత్యంత విధేయత
రత్నకిరీటముల్ రమ్యమైన
నీచరణ పద్మములనిడి, నెగడినారు;
ఇంద్ర నీల దేహచ్ఛాయ! ఇందిరా, ర
మణ! జనకసుతాధిప! నానమస్సు లివిగో
రక్షణము, సేయుమయ్య! శ్రీరామచంద్ర!

౨

శ్రీశంఖ చక్రముల్ చెలువుగాధరియించి
ఆదిశేషుని, దేహమందుఁబండి
సీతతోఁగూడి, యాశ్రితులను రక్షించి
సింహాసనము, నధిష్ఠించి, కల్ప
వృక్షంబు భాతి, నిర్వేద్కతో సేవించు
వారి కోర్కెలొసంగి, వారిజాక్ష!
శ్రీరంగ నాయకు శ్రీపాదపద్మముల్
మనమున ధ్యానించు మాననీయ!
శ్రీశ! రఘువీర! శ్రీరామ! చిత్ప్రకాశ!
ఆప్త బాంధవ! శ్యామాంగ! హరి!
ముకుంద!
నిన్ను సతతంబు ధ్యానింతు నెమ్మనమున
నన్ను రక్షించిబ్రోవవే, సన్నుతాంగ!

౩

అరుణాధరము మీఁది యానంద రేఖతో -
పీతాంబరముతోడ వెలయు వాఁడు
అక్షాంతవర్ణుఁడై-యవిసె పువ్వులకాంతి -
గ్రక్కు శరీరంబు గల్గువాఁడు
అకలంకుడై, యమేయ స్వరూపుఁడయి, -
యాద్యుఁడయి, జగంబునఁ దోచువాడు
అంబుజాక్షుండయి, యఖిలలోకము-
మెచ్చు, గొప్ప సౌందర్యంబుఁగొన్నవాఁడు
వాఁడు, మావాఁడు శ్రీరమా వల్లభుండు
రఘుకులేశుండు, హితుఁడు శ్రీరామచంద్ర
మూర్తి, శరణుజొచ్చిన వారి ముదము
తోడఁ
బ్రోచు నాతనిసేవింతు - ముదము తోడ.

౪

నవరత్నఖచితమౌ, నతవ్యధ్యజావళి।, చే -
నలంకృతమయి చెలువుమీఱు

సౌధంబులోపల స్వర్ణాష్ట దళపద్మ ! -
మొండు, విరాజిల్లు నొప్పుగల్గి
అయ్యష్టదళ పద్మమందుండును, విమాన ! -
మందు రాఘవుఁడు, భార్యాసమేతు
డతని, వానరులు, దిక్పతులు కిన్నరులు -
లక్ష్మణ, భరతాదులు త్మ్మాపతులును
మునిగణములెల్ల సాకేతపురమునందు
భక్తితోఁగొల్చుచున్నారు ప్రాభవమున,
నట్టి శ్రీరాము సతతంబు నాశ్రయింతు
రక్తితోడుతఁ గైవల్య ప్రాప్తికొఱకు.

౫

నీలమేఘశ్యామ ! నిత్యస్మితానన ! కోట -
మన్మథ తేజ ! కువలయేశ !
కస్తూరితిలకంబు, కర్ణకుండలములు, కౌస్తు-
భమణి దాల్చి కౌతుకమున
కంబుగళము చెంత, కమనీయమైయొప్ప, -
జ్ఞానముద్రవహించి జాను మీఁఱ,
భూపుత్త్రితో, వాయుపుత్త్రునితో, -
లక్ష్మణునితోడఁ గూడినయినకులేశ
జ్ఞానతత్త్వంబు బోధించి శాంతిఁగూర్చి
భక్తగణముల రక్షించు పంకజాక్ష !
చారుసింహాసనము నందు, ధీరుఁడగుచు
వెలయుచున్నావు; శ్రీరామ! వినుతిసేతు.

౬

శంఖ, చక్ర కౌస్తుభమణీ చారు హార
ములు, కిరీటంబు, భుజకీర్తులు, లలితముగ
గల్గి, శ్రీవత్స చిహ్నంబుగల్గి, వరద !
పట్టు పుట్టంబుఁ గట్టిన పంకజాక్ష
శుభము లొసఁగుము కుండల శోభితాంగ!
రామ ! శ్రీరామ ! రఘువీర ! రామచంద్ర!

౭

మొలనూలుగజ్జెలు మ్రోయుచునుండ
ముంగురుల్ నుదుటను ముసరి వ్రేలాడ
నందెలు 'గల్లుగల్ల'నుచు శబ్దింప
మోకాళ్లపైఁ ముద్దుముచ్చటల్ మెఱయ
నడయాడు శిశురాము - నటనాధురీణు
మధురవాక్యనిపుణు - మాయాప్రవీణు
కమలలోచనుని, దిగంబరు సతము
ప్రార్థింతు మనమునఁ బరిశుద్ధుఁడగుచు.

౮

కల్పవృక్షముక్రింద, కమనీయమైన
మణిపీఠమందున్న, మహనీయ తేజ
నానంద కరుఁడైన, యమృతస్వరూపు
నాది, విరాటు - మహాతేజు, నాద
బిందుకళా తీతు, వీరాధి వీరు
రఘువంశతిలకు, శ్రీరాము, సంపూర్ణు .
నా మనోజాడ్యంబు నశియించుకొఱకు
భక్తితోఁ బ్రార్థింతుఁ బ్రణతులొసంగి.

(సశేషము)

# అ ల రా జు

## శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి



[అది మండాది ప్రాంతము. బ్రహ్మనాయుడు, బాలచంద్రుడు, అలరాజు కూర్చుని ఉంటారు.]

బ్రహ్మనాయుడు:—నాయనా బాలచంద్రా! మన కష్టములు గట్టెక్కినవి. నేటితో ఆ గడువు కూడా తీరిపోయినది. ఇక మనకు రాజ్యప్రవేశార్హత కలదు. ఓడినది కోడి పందెములోనైనను, ఆ కోడి పందెము మోసభూయిష్టమైనదైనను సత్యపరిపాలనకై అన్ని ఇడుములను చిరునవ్వుతో అనుభవించాము. ఇక మన రాజ్యము మన కివ్వవలసినదిగా అడుగవలసియున్నది.

బాలచంద్రుడు:—అడుగవలసిన అవసరమేమున్నది నాన్నగారూ! మనము ప్రవేశింపకూడదా! గడువయిపోయిననూ వారి అనుమతిఏల?

అలరాజు:—వారికి గడువు సంగతి తెలియునో తెలియదో! మనము ఈ సమాచారము వారికి తెలుపవలసి ఉంటుంది.

బాల:—తెలుపుట, వారు అనుగ్రహించుట, అనుమతించుట ఏమిది నాన్నగారూ! మనకు మాత్రము భాగములేదా! ఈ విధంగా మనము ప్రవర్తిస్తే మన కష్టములు గట్టెక్కవు నాన్నగారూ!

బ్రహ్మ:—బాలాచంద్రా! నీది ఉడుకు రక్తము. మనమే పని చేసినను ఆలోచించి న్యాయబద్ధముగా చేయాల నాయనా! తొందరపడరాదు.

బాల:—న్యాయము-బద్ధము, ఏది న్యాయము నాన్నగారూ! పందెమునిపెట్టి మోసముతో ఓడించి రాజ్యమపహరించి అడవుల కంపించుట న్యాయమా! మంత్రిగానున్న మిమ్ములను తొలగించి ఆ ఆడుదానికి ఆ పదవి నొప్పజెప్పుట న్యాయమా? మలిదేవాదులకు రావలసిన భాగాన్నైతము యివ్వకుండా ఉండటము న్యాయమా? ఈ విధంగా అడుగులకు మడుగులొత్తుతూ అణగి మణిగి ప్రవర్తిస్తే మన పరువు గంగపాలు కావటమే కాకుండా చులకనయిపోతాము?

బ్రహ్మ:—ఆగు బాలచంద్రా! నేడు మనకున్న గౌరవము దేనివలననో తెలుసా! మన సత్యపరిపాలన, ధర్మదీక్ష, దైవభక్తి. మోసము ఎపుడు మోసగింపబడుతూనే ఉంటుంది నాయనా!

అల:—అయితే యిప్పుడు మనము చేయవలసినపని?

బ్రహ్మ:—మన గడువు దాటినదనియు, మనకు ప్రవేశార్హత కలిగించవలయునని తెలుపుటయే.

బాల:—నాన్నగారూ! ఈ నాడేపోయి ఆ నలగామరాజును నిలువదీసి అడుగుతాను.

బ్రహ్మ:—నాయనా! నీ మాటలు వింటుంటే నా హృదయం సంతోషంతో పొంగిపోతుంది. ఈ చిన్న వయసులో నీవు మాట్లాడే మాటలు విచిత్రంగా ఉన్నవి. అయినా నీవు పుట్టినది ఏగడ్డ మీద! పల్నాడు వీరుల జన్మస్థలము - పౌరుషానికి పుట్టిల్లు. పెరిగింది ఏతల్లి ఒడిలో. అయితే రాజ్యతంత్రము నీతి ఇంకా నీకు తెలియదు నాయనా! మనము ముందువారికి అవకాశము యివ్వాలి. తరువాత ఏమిచేసినా తప్పంతా వారిపైననే ఉంటుంది.

అల:—అదేమిటి బాలచంద్రా! అలా మాట్లాడుతావ్! అన్యాయాన్ని మేము మాత్రము సహిస్తామా! న్యాయంగా ప్రవర్తిస్తే సరేసరి. లేకపోతే బాలమలి దేవాదుల భాగము ఉండనే ఉంది. అవి ఏలా తప్పించుకుంటారు.

బ్రహ్మ:—అలరాజా నీవు వెళ్ళి చెప్పగలవా? ఈ పరిస్థితియంతా వివరించి అన్ని ఏర్పాట్లుచేసికొని రావలసియున్నది.

అల:—అలాగే రేపే బయలుదేరిపోతాను. బావా నీవు ఉద్రేకపడవలసినపనిలేదు. అన్నీ నేను సానుకూలపరచుకొని వస్తాను. అట్లా వీలుకాని పక్షంలో మనం చేయవలసినపని ఉండనే ఉంది.

బ్రహ్మ:—అలరాజా! నీవు ఏ ఒడుదుడుకులు లేకుండా ప్రయత్నించు. న్యాయము మన పక్షాన ఉంది.

అల:—సరే! నా ప్రయాణానికి ఏర్పాటు చేయించండి. రా బాలచంద్రా అలా గాలికి తిరిగి వద్దాము.

2

[అది గురజాల, పల్నాటి రాజధాని, నలగామరాజు తమ్ముడు నరసింగరాజు, మంత్రిణి నాయకురాలు తదితరులు ఉంటారు.]

అల:—(ప్రవేశించి) నమస్కారం మామగారూ!

నలగామరాజు:—రా! అలరాజా! అందరు క్షేమమా? బ్రహ్మన్న క్షేమమా?

అల:—ఆ చెన్నకేశ్వరుని దయవలన అందరూ కుశలమే మామగారూ! ఇక్కడ అంతా క్షేమముగా ఉన్నారా!

నాయకురాలు:—ఆ! ఆ ఈశ్వరుని కృపవలన అందరూ క్షేమమే. ప్రజలుకూడా పాడిపంటలతో వర్ధిల్లుతున్నారు.

నల:—అలరాజా! ఏమి నాయనా ఆలా చిక్కిపోయావు. నీ ఆరోగ్యము సరిగాలేదా, లేక నీవు నివసించు ప్రదేశ ప్రభావమా? బంతివలె ఉన్న నీవు ఈ విధంగా చిక్కిపోయావు! ఇక్కడే ఉండిపో అలరాజా!

నరసింగరాజు:—అడవిలో కోయలలో కోయడై స్వేచ్ఛగా వేటలతో, పాటలతో కాలంగడుపుతూ సంతోషంతో ఆహారపానీయాలను మరచాడేమో! అందువలన ఈలా చిక్కిపోయి ఉంటాడు.

అల:—క్షమించండి చినమామగారూ! ఇంకా నాకు బాల్యమేనా! రాజ అహంభావము నన్ను వంచలేదు. రాజ్య తంత్రము నేర్చుకోలేదు. ఒకరిని వలలో వేసుకో ప్రయత్నించలేదు. అందుకు బలవనూలేదు.

నర:—అయితే నేను.

అల:—నేనామాటన్నానా మామగారూ! నా బలుపును గురించి చెప్పాను అంతే.

నర:—అంతమాత్రం అర్థంగాని పరిస్థితిలోలేను అలరాజా! మాపై కత్తి కట్టినట్లున్నావు?

అల:—అదేమిటి చినమామగారూ! ఇందులో కత్తి కట్టేదేమున్నది. ఓడినవారు ఓడారు. పోయిన వారు పోయారు. మధ్యలో నీది నాది ఏమి పోయింది. తినగలిగినవాళ్ళు అందరూ తింటారు. ఎవరుచేసికున్నదివారు అనుభవిస్తారు. వారు ఎవరిని కష్టపెట్టారో యిప్పుడు అనుభవిస్తున్నారు. గర్భమొచ్చిందని సంతోషంకాదు కనేటప్పటి బాధ నాలోచించుకోవాలి. మనము చేసుకున్నవి మనమనుభవింపవద్దా!

నల:—అల్లుడా! అలరాజా! నీ రాకకు కారణము?

అల:—మామగారూ! కోడి పందెములో ఓడిన కారణాన షరతు ప్రకారము అడవులలో నివసించారు. గడువయిపోయినది. వారికి ప్రవేశార్హత నివ్వవలసినది. కోడిపందెము కూటమైనదైనను ధర్మతత్పరతకొరకు అంగీకరించి ఎన్ని యీతి బాధలైనా లెక్కచేయకుండా తమ మాటను నిలబెట్టుకొన్నారు. ఇక మీ మాటకూడా నిలబెట్టుకోవాలి.

నాయ:అలరాజా! మీరు వచించిన మాటలు వింటుంటే నాకు నవ్వొస్తుంది. ఎంత హాస్యాస్పదంగా మాట్లాడారు. మోసమని తెలిసిన ఆ

నాడే చెప్పకూడదా! ప్రత్యక్షంగానే నిరూపించకూడదా! ఈ ఒక నిందను సృష్టిస్తున్నారన్నమాట. ఇదంతా చూస్తే ఆడలేక మద్దెల ఓటిదన్నట్లుంది.

నర:_మంత్రిణీ! గడచిన దానిని గురించి చర్చ అనవసరం. ఇక జరుగవలసిన విషయాలను ఆలోచించాలి.

నల:_జరిగిన దానికి నాకు ఎంతో విచారము కలుగుచున్నది. పితృ సమానులైన బ్రహ్మన అక్కడ అవస్థపడుతుంటే నేను యిక్కడ రాజ్యాన్ని పాలిస్తున్నాను. భగవంతుని దయవలన మరలా అందరముకలసి సుఖంగా ఉండే రోజులు వస్తున్నయ్.

నాయ:_అదేమిటిరాజా! కర్తవ్యపాలనమేగదా! రాజులకు ముఖ్యము. జూదములో ఓడిన ధర్మరాజు ఏంచేశాడు? అంతే. దానికి చింతించవలసిన పనిలేదు. మీ రెందుకు బాధపడతారు?

అల:_నేవచ్చినపని పూర్తిచేస్తే నే వెళ్తాను. మనమందరమూ సుఖంగా ఉండటమే నా అభిమతము.

నల:_అపుడే ఏలా వెళ్తావు అల్లుడూ! ప్రయాణ బడలిక తీర్చుకొని రేపు వెళుదువుగాని.

అల:_సరే అలాగే మామగారూ!

నాయ:_బ్రహ్మన్న కుశలమే నా అలరాజా!

అల:_ఆఁ, ఈ సంసార బంధాలనుండి విముక్తిగావించమని ఆ మాచర్లలక్ష్మి చెన్నకేశ్వరుని ఎల్లప్పుడూ ప్రార్థిస్తుంటాడు. ఏమిటో నీవువచ్చి ఆయనమీదగల భారాన్ని తీసివేసి ఆయనకు ఆ పరమాత్మునికొలచే అవకాశాన్ని కల్గించావని ఎంతో సంతోషపడుతుంటాడు.

నాయ:_కాని ఆత్మ సంతృప్తే ప్రధానమా! ప్రజాక్షేమముకొరకే నేను ఈ కార్యభారము నిర్వహిస్తున్నాను. ప్రజల సుఖమే నా సుఖము.

అల:_అయితే మేము ప్రజలము కామన్నమాట. మమ్ములను అడవికిపంపి నీవు ఈ విధంగా ఉంటే మీ విరూపాక్షుడు మాత్రము సహిస్తాడా!

8

[అది అంతఃపురములో ఒక తోట. అందులో నలగామరాజు ముద్దులపట్టి సౌందర్యరాసి, సుగుణాలపట్టి అయిననవవికసితపుష్పితమైన పేరమ్మ వీణవాయించుచుంటుంది.]

చెలికత్తె:_యువరాణీ! యువరాణీ! మీకో మంచి వార్త తెచ్చాను. నాకు బహుమానము యివ్వాలి?

పేరమ్మ:_ఏమిటే కోమలీ!, త్వరగాచెప్పు!

చెలి:_అలా చెప్పను; తమరు ముందు నాబహుమానం మాట!

పేర:_సరే! ఈ హారముతీసికో!

చెలి:_వచ్చారు?

పేర:_ఎవరే!

చెలి:_వారు.

పేర:_ఏ వారు.

చెలి:_వచ్చారమ్మా వచ్చారు.

వలరాజు కుంచువాడు
అలరాజుగారు వచ్చారు
పూలబంతులు తెచ్చారు
చెలపేరమాంబ కిడగ!

పే:_ఆఁ. అలరాజొచ్చారా! నేడెంత సుదినము. చెన్నకేశ్వరా నా మొరాలకించావా తండ్రీ! ఈ నాటికి నా ప్రభువు దర్శనభాగ్యం కలిగిందా! ధన్యురాలను దేవా! కోమలీ! వారు ఎక్కడున్నారు, ఎట్లా ఉన్నారూ, ఏంచేస్తున్నారు, ఎప్పుడువస్తారిక్కడికి, వస్తే ఏలా మాట్లాడాలి?

చెలి:—ఆగమ్మా! ఆగు నాకు ఉండేది ఒక్కనోరే. నీ వడిగే ప్రశ్నలా వేలు, ఇన్నిటికి ఒక్కసారి సమాధానం చెప్పగలవారు ఒక్కరున్నారు.

పేర:—ఎవరే. త్వరగా రప్పించు.

చెలి:—చెప్పనా.

పేర:—చెప్పు త్వరగా.

చెలి:—అలరాజుగారు.

పేర:—ఆగు. ఏమిటా పరిహాసాలు.

చెలి:—అరుగోమ్మా! విడిదికి వెళుతున్నారు. రాయబారింగా వచ్చారట. రేపు వెళతారట. చూడండమ్మగారూ! ఆ ప్రశాంతత. ఆ చిరునగవు.

పేర:—(నిశ్చేష్టితయై) ఆహా! ఏమి ఆ సుందర విగ్రహము. నేను నిజంగా ధన్యురాలను. నిజంగా నా అలరాజు వలరాజు కంటే అందగాడు. నా పతి చరణాలను పూజించే భాగ్యము నా కెన్నడు లభిస్తుందోగదా. ఆ విశాల ఫాల భాగము, ఆజానుబాహు విగ్రహము, గాలిలో అలల్లా తేలిపోతున్న ఆ తలపాగా! పాద రక్షలనుండి కనుపించే ఆ అరుణచరణాలు, అబ్బ! నా జీవితమే జీవితము. స్త్రీ జన్మ ఎంత సుందరమైనది! ఎంత మధురమైనది. కోమలీ నా మనవి ఒకటి నెరవేర్చుతావా?

చెలి:—తప్పమ్మా! మీరు అట్లా అనకూడదు. ఆజ్ఞాపించండి.

పేర:—వారికి కావలసిన సర్వ సదుపాయాలు నీవే దగ్గరుండి చేయించు.

చెలి:—మీరు వేరే నాకు చెప్పాలమ్మా! (వెళ్తుంది)

పేర:—ఈ విధంగా ఒంటరిగా నేనెంతకాలము గడిపేది స్వామీ? నా పతి చరణాల పూజించే భాగ్యం కల్గించు తండ్రీ! నేనేం పాపంచేశానని నాకీ ఎడబాటు. నా పతి సమాగమము నాకు త్వరలో ప్రసాదించు చెన్నకేశ్వరా! ఇంతకంటే ఈ జీవితంలో నేను కోరదగింది ఏమీలేదు. వారికి ఏకష్టంరాకుండా కాపాడు భగవంతుడా!

♦ ♦ ♦

[అది ఆలోచనా మందిరము. నరసింగరాజు నాయకురాలు ఉంటారు.]

నర:—అవును నేను అదే ఆలోచిస్తున్నాను.

నాయ:—నీవుకూడా విన్నావుగా! అల్లుడిని చూడగానే అన్నగారు జాలి చూపించారు. చివరకు మనము పరాయివారమౌతాము.

నర:—నేను మాట్లాడాను విన్నావా! చలోక్తులలోనే దెబ్బతీశాను.

నాయ:—నాకేమో భయంగా ఉంది యువరాజా; మరలా వారు యిక్కడకు చేరితే మీకుయువరాజ పదవి, నాకుమంత్రి పదవీ ఊడినట్లే;

నర:—నిజమే ... కాని ఉపాయం ... అనుకున్న గడువు పూర్తయింది. వారికి అనుమతి యివ్వకుండా ఏలా ఉండగలం.

నాయ:—మనసంటూ ఉంటే మార్గమే లేకుండా పోతుందా! ఆ విషయాన్ని నాకువదిలెయ్.

నర:—కాని వారికి యివ్వవలసిన సగము వారికిస్తే చిక్కుతీరిపోతుంది.

నాయ:—నరసింగరాజా! నేడోరేపో నీసాహస కృత్యాలు అన్నగారికి తెలియకపోవు. అప్పుడు నీకెలాగయినా నీరాజ్యాన్ని పంచుకోనక తప్పదు. అసలు రాజ్యమెంత? అందులో కులదేవాదులకు సగముపోతే మిగిలిన దానిలోసగము ఎంత? ఆలోచించుకో!

నర:—నిజమే మరి దీనికి ఉపాయము.

నాయ:—ఆలోచించాను. కాని చాలా ఘనకార్యము చెయ్యాల్సి ఉంటుంది.

నర:—నాగమ్మా! ఆనాడు అన్యాయంగా

పాపమైన కోడిపందెంచే అడవులపాలు చేశాము. ఈనాడు వారికి అపకారము తలపెట్టటము మంచిది కాదేమో. జరిగిన దానికే అన్నగారు బాధపడుతున్నారు.

నాయ:_ముందు నేచెప్పినపని చేస్తానను.

నర:_చెప్తేగదా !

నాయ:_నీవు నీస్వాతంత్ర్యాన్ని నిల్పుకోవాలంటే, నీ ఆటలు సాగాలంటే నీకోర్కెలు నెరవేర్చుకోవాలంటే, చివరకు నీవుఒకమనిషిగా బ్రతకాలంటే ఈ రాత్రికి రాత్రే అలరాజు హత్యగావింప బడాలి అంతే.

నర:_ఆఁ అలరాజు హత్యా ! ఏమిటి నాగమ్మా ! తెలిసేమాట్లాడుతున్నావా ! నాకు రాజ్యమూ వద్దు ! పదవీవద్దు. ఇంత ఘోరకిరాతకృత్యమా ! అల్లుడిని రాజ్యంకొరకు హత్యచెయ్యాలా ! అతిధిగా వచ్చినవారిని - నాచిట్టితల్లి పేరమ్మ గతి ఏమవుతుంది ! ప్రాణప్రదంగా చూచుకుంటు న్నానే.

నాయ:_నరసింగరాజా ! పాతరాజుల సమాధుల మీదనే క్రొత్తరాజుల సింహాసనాలని మరచి పోకు. ఇదే రాజ్యతంత్రము. ఎవరికి ఎవరు చెప్పు ! ఈ లోకంలో నీకుంటే నీది. నాకుంటే నాది. బ్రతికినన్నాళ్లు హాయిగా బ్రతకాలి. చని పోయినతరువాత ఏముందో ఎవరికి తెలుసు. అయితే నాకు మంత్రి పదవికోసం ఈ పని చేస్తున్నాననుకున్నావా ? హాయిగా జిట్టగా మాలపాటిలో పూలతోటలో ఈశ్వరుని సన్నిధానములో పూజచేసుకునియైనా జీవితాన్ని గడ పగలను-నేనిస్త్రీని. కాని నీ పరిస్థితి-వారురాగానే నీవు సేవకుడివైతావు. వారి అడుగులకు మడుగు లొత్తాలి. రాజ్యాంగము బ్రహ్మన్న చేతులలోకి పోతుంది. ఇకపేరమ్మ సంగతా ! ఆమె ముఖాన అలారాసి పెట్టి ఉంటే, నీవు అలరాజును లక్షసైని కుల మధ్యనుంచి రక్షించినా మృత్యువును ఎదిరించ లేవు.

నర:_అయితే తప్పదంటావా నాగమ్మా !

నాయ:_నీయిష్టము.

నర:సరె ! ఈ కార్యనిర్వహణ అంతా నీదే ! ఏ విధంగా నెరవేర్చాలి! ఎవరికీ తెలియకూడదు.

నాయ:_ఆ పని నాకు వదలెయ్యి !

నర:_సరె : ఏ విధంగా :

నాయ:_దర్బారు నర్తకికి నిషం కలిపిన పాలనిచ్చి అతనిచే త్రాగించివేసరి.

♦ ♦ ♦

[ఆనాటి రాత్రి అలరాజు అమాయకంగా నృత్యంలో నర్తకియిచ్చిన పాలను త్రాగి మరణిస్తాడు. ఈ వార్తను విన్న నలగామ రాజు కంపించి పోతాడు. పేరమ్మ గుండెల్లో అగ్ని చెలరేగి పతివియోగమును భరించలేక సహగమనం చేస్తుంది.]

# హా తాత్ర

శ్రీ వేమూరి చంద్రమౌళి



"నవమాసమ్ముల నిండుగర్భవతి నన్యాయమ్ముగా వీధి ని
ట్లవమానింపుచు వెంటపర్వులిడు దుష్టాత్ముం డెవండౌను ? క
న్గవ రక్తాశ్రువులూర్ల నాయువతి కంఠమ్మెత్తి దీనాతి దీ
న విలాపమ్ములు సేయుచున్నదదియన్నా ! చూడుమా దృశ్యమున్.

వేదన నోర్వలేక పలవించుచు పర్వెడుదాని గర్భ ని
ర్భేదక సింహనాదముల భీతిలజేయుచు కోపరోష స
మ్మేదుర దృష్టితో ననుగమించు పరశ్వథధారి, యిందఱన్
గాదని క్రూరుఁడై, నఱకునా ? నడివీధిని, మాతనద్దియున్."

అనిగ్రామీణులు శోకమూర్తులయి డాయంబోయి యవ్వాని బ్రా
హ్మణు, తామ్రాంశు జటాచ్ఛటా భరణు, రక్తాక్షున్ మహాకోప సం
జనితోన్మాదు, భయంకర భ్రుకుటి భంగాద్దుర్నిరీక్ష్యున్ ఘనా
ఘన గర్జాన్వితుగాంచి యప్రతిభులై కంఠేగత ప్రాణులై.
హడలు గుడుచుచు పరశురాముఁడని రొతిఁగి-మారుపల్కులులేక గుమ్మములకడకుఁ
దిరిగి పరువెత్తి దూరి బంధించి వైచి,-తలుపు రంధ్రాలఁజూచుచు నిలువఁబడిరి.

* * *

"కార్తవీర్యుని పౌత్రిని, గర్భవతిని,-పరశురాముఁడు వెన్నంటి తరుముకొనుచు
ననువధింపగ వచ్చుచున్నాఁడు, మిమ్ము-శరణుఁజొచ్చితి, నబల, రక్షణముకొఱకు."

"భీతి యొకింతలేదు నులివెచ్చని బాష్పకణమ్ము లూర్చుచున్
యాతన నొందఁబోకు మబలా ! ఇటు జూడుము, రాజరక్త సం
జాతుఁడ, నాంధ్రవీరుఁడ, రణమ్మున వెండిలినాకు నేఁడు యు
ద్ధాతుర వృద్ధసింహమన హుంకృతితో నెదిరింతు భార్గవున్."
మానిని ! భీతిలేదిక కుమారిక వీవిఁక నాకు గొంతులో
ప్రాణములున్నచో ! పరశురాముఁడు నీపయి చేయివేయలేఁ
డే, ను గతించునాఁడు పరమేశ్వరుఁడే ఇఁక నీకు రక్షర
మ్మా ! నవకోమలాంగి, యణుమాత్రము సంశయమొందఁబోకుమా.
అది పలనాఁటి యాంధ్రుల మహోత్తర వీరుల రంగభూమి, యం
దది యొకమారు మూల భవనమ్మటు నాఁడొక వృద్ధవీరుఁడా
ముదితనుజేరఁ దీసి కృపబుట్టఁగ బల్కిన నూరడిల్లి స
ద్హృదయత కెంతొ మేనుపులకింప కరమ్ములు మోడ్చె నాతియున్.

* * *

“నెనరెఱుంగని యత్యంత నిష్ఠురాత్మ ! - మొరటుగుండెల బ్రాహ్మణబ్రువుఁడవీవు
కడుపులోనున్న పసికందు కఱచెనట రా? - నఱుక వచ్చితి నన్నింక నఱుకుమోయి !”

అని తలవాంచి పల్కి జమదగ్నితనూజుని ముందునిల్వ, దా
రుణ తరరోషవేగమున రుద్రుని వోలుచు హుంకరించి క్రే
టునకె ధరిత్రి నామె తల డొల్లగ నేసి పరశ్వధమ్ముతో
తొణకిన నెత్రు తుంపురులఁదోగిన భార్గవుఁడేగె తుష్టుఁడై.

♦ ♦ ♦

కలకలలాడు ముద్దుల మొగమ్మున పెద్దకుమార్తె యింటిలో
పలగనరాని వృద్ధుఁడు వివర్ణ ముఖుండయి తొట్రుపాటుతో
నిలువున వ్రీల్ని గుండియలు నీరయిపోవఁగఁ బర్వెత్తి వీ
ధులఁబడి, గద్గద స్వరముతోఁ బలుమారులు పిల్చి ఖిన్నుఁడై.

ధారుణిపై మహారుధిర ధారలలో పొరలాడుచున్న ర
క్తారుణగాత్రి గర్భవతి ఖండిత శీర్షక నాత్మపుత్రిగా
దూరమునుండిగాంచి యెటుదోఁపక గద్గద ఖిన్న కంఠుఁడై
భోరన నేడ్చి యా ముదిత మొండెముపైఁబడె నిర్వికారుఁడై.

♦ ♦ ♦

“నా నిమిత్తము నిండు ప్రాణముల తోడ - ఆ దురాత్మునికాహుతియైతివకట !
ఆంధ్ర ధారుణిలోని హుతాత్ములందు - నీ మహా త్యాగమే స్మరణీయమగును.
అంజలి ఘటింతునో మహా త్యాగమూర్తి - ఇంతకన్నను నేనిపుడేమి సేతు !”
హంసలాదేవి ఇటులని యచటఁబడియె - కన్నులకవోష్ణ బాష్పంబు కణము లురల.

(ఒక ఆంధ్ర జానపదగాధ ఆధారంగా)

---

# సోవియట్ పాఠశాలల్లో బాలలకు మొదటి పాఠాలు ఎలా నేర్పబడుతాయి ?



సోవియట్ దేశం పాఠశాలల్లో కొత్త విద్యా సంవత్సరం ప్రారంభమయినప్పుడు పాఠశాల ప్రధానోపాధ్యాయుడు క్రొత్తగా వచ్చిన బాలలు విద్యాభ్యాసానికి వచ్చినందుకు వారిని అభినందిస్తూ ఉపన్యసించి వారిని పాఠశాలకు ఆహ్వానిస్తాడు. అటు తర్వాత వారి, తరగతి ఉపాధ్యాయుడు ముందునడువగా బాలలందరూ ఒకరి తర్వాత ఒకరుగా క్లాసుగదికి వెళుతారు.

అప్పుడు మొదటి పాఠం ప్రారంభమవుతుంది.

ఉపాధ్యాయుడు పిల్లలకు వారివారి స్థలాలను చూపించి వారితో పరిచయంచేసుకొంటాడు. అటుతర్వాత బాలలు పాఠశాల చుట్టూతిరిగి పాఠశాలనూ, ఆటస్థలాలనూ చూస్తారు. మొదటి పాఠం యీ విధంగా పూర్తవుతుంది.

అన్నిటికంటే మొదటి క్లాసులో మొట్ట మొదటి పదిరోజులు చదవడం, వ్రాయడం నేర్పడానికి ప్రయత్నంతో గడిచిపోతాయి. బాలలకుటుంబాలగురించి, వారి సెలవుల గురించి, వారి ఆటలగురించి వారికి ఆహ్లాదం కలిగేటట్లుగా ప్రసంగించడమే మొట్ట మొదటిపాఠాలు. అదే సమయంలో బాలలకు క్లాసుగదిలోకి యెలాప్రవేసించడం, యెల్లా క్లాసుగదిలోంచి బయటికివెళ్ళడం తమబల్లలముందు యెలాకూర్చోడం, నిలబడ్డం, ఉపాధ్యాయునికి యెలాసమాధానం చెప్పడం మొదలైన విషయాలనుగురించి తెలుపడం జరుగుతుంది. ఉపాధ్యాయుడు తానుచెప్పే విషయాలను బాలలు యెలా శ్రద్ధగా వినాలో మొదటిరోజులనుంచి నేర్పుతాడు. బాలలు ఉత్సాహంగా తమకు తామై ఉపాధ్యాయుడు చెప్పిన చక్కని కథలను తిరిగిచెబుతారు.

మూడవ రోజున, లేదా ఆ దరిదాపుల్లో, ఉపాధ్యాయుడు మన ప్రసంగము వాక్యాలలో కూడి ఉంటుందనీ, ఆ వాక్యాలు మాటలతోకూడి ఉంటాయనీ బాలలకు విశదపరుస్తాడు. మూడు, లేక నాలుగు వాక్యాలతోకూడిన ఒకచిన్న కథ బాలలకు చెప్పబడుతుంది.

సోవియట్ పాఠశాలల్లో వ్యాకరణము ధ్వని విశ్లేషణ – సంశ్లేషణపద్ధతులద్వారా (ఒక ప్రత్యేక అచ్చు, లేదా హల్లుకు సమమైన ఉచ్చారణ) నేర్పబడుతుంది. మాట్లాడే భాషయొక్క ప్రమాణాల విషయాలు యివేగాబట్టి వీటికి ధ్వని పద్ధతులు అని పేరు. చదవడానికీ, వ్రాయడానికీ నేర్చుకోడానికి ముందు ఉచ్చరింపబడే శబ్దాలను

ఒకదానినుండి మరొకదానిని తెలుసుకొనగలగడం అవసరం. ధ్వనిపద్ధతిలో ప్రతి కొత్త ధ్వనిని, మాటను నేర్పడం యిలాగ జరుగుతుంది. ఉపాధ్యాయుడు ఒక కొత్త ధ్వని ఉచ్చారణను నేర్పడానికై ఒక మాటను తీసుకొని దానిలోగల వివిధ ధ్వనులు విడదీసి కొత్తగా నేర్పబడుతున్న ధ్వనికి ఇతర ధ్వనులతోగల సంబంధాలను సవివరంగా తెలుపుతాడు. ఈ విధంగా ధ్వనులను నేర్పుతూ నెమ్మది నెమ్మదిగా అక్షరాలను నేర్పడం ప్రారంభిస్తారు. తెల్ల కాగితాల పుస్తకాలమీద గీతలు గీయడంతో ప్రారంభించి అక్షర నిర్మాణాన్నిగురించి తెలుపడం జరుగుతుంది. అక్షరనిర్మాణాన్నిగురించి యీ విధంగా నేర్పబడిన తర్వాత ఉపాధ్యాయుడు బాలలు వ్రాసిన అక్షరాలను పరిశీలించి వాటిలో యేవైనా పొరపాట్లు ఉంటే సరి చేస్తాడు. ఈ విధంగా అక్షరాలను బాలల చేత అనేకపర్యాయాలు వ్రాయిస్తారు. ఈ విధంగా వారికి వ్రాత అలవాటు చేయబడుతుంది. ఉపాధ్యాయుడు వారి పొరపాట్లుయేవైనా ఉంటే యెప్పటికప్పుడు వాటిని సరిచూస్తుంటాడు.

విద్యాసంవత్సరం మొదటి ఆరు మాసాలు పూర్తి అయ్యేలోగా అక్షరమాలను నేర్పడం పూర్తి అవుతుంది.

# బిడ్డలు - తల్లిదండ్రులు

## క్రీడ

శ్రీ కె. వెంకట్రామయ్య

రెండేండ్లనుండి ఆరేండ్లవరకు బిడ్డల కవసరమగు వివిధరకముల ఆట సామాగ్రులు:-

క్రింద నిచ్చిన ఆటసామాగ్రుల జాబితా సూచకము మాత్రమే. ప్రతి రకమునుండి తల్లిదండ్రులు వారికి తోచిన వెంచుకొనవచ్చును. బిడ్డకు వివిధరకముల ఆటవస్తువులను ఈయవలెను. అప్పుడే అతడన్నివిధముల వికాసమును పొందును.

1 బయటి ఆటకు తగిన ఉపకరణములు:- (Equipment for outdoor play)

ఈ సామాగ్రులు ముఖ్యముగా బిడ్డల దేహాభివృద్ధికిని, పెద్ద కండరముల అభ్యాసమునకును ఏర్పాటైయున్నవి. ఇందు కొన్ని లోపల వాడునవి గూడ కావచ్చును.

ఆట సామాగ్రులను జాగ్రత్తపరచుటకు ఒక చిన్న షెడ్డుగాని, మూతగల పెద్ద ప్యాకేజీ పెట్టెగాని ఉండవలెను.

ఎక్కుట (Climbing), నడచుట, శరీరమును సరిగా నిలుపుకొనుట (balancing), గంతుట (Jouncing) మొదలగు క్రీడలకై వేరువేరు పొడవు, వెడల్పు కొలతలుగల బల్లచెక్కలుండవలెను. చెక్కల చివరలందు క్లీట్లు (Cleats) బిగించుటచే వానిని కట్టడములపైగాని, పెట్టెలు మొదలగువానిపైగాని కదలకుండ అమర్చవచ్చును. చెక్కల పొడవు 8 అ. నుండి 12 అ. వరకును, వెడల్పు 6 అ. నుండి 15 అ. వరకును ఉండవచ్చును. చెక్కలు పేళ్లు లేచియుండరాదు. ఎల్లప్పుడు వానిని మంచి స్థితియం దుంచవలెను. ఎల్లగిసె నూనెను (Linseedoil) వ్రాయుచుండిన యెడల కర్రపుచ్చకుండును. బయటి ఆటకు వాడెడి ఉపకరణము లన్నిటికిని స్క్రూలను, బోల్టులను వాడుట మంచిది.

బిడ్డలు వంతెనవలె ఎత్తుగా నమర్చిన బల్లచెక్కలపై నడచుట కిష్టపడుదురు. ఒక వైపున మాత్ర మెత్తి, వాలుగా నమర్చిన బల్లలమీద పైకిని, క్రిందకును పరుగిడ నిచ్చగింతురు.

6 అ. నుండి 8 అ. పొడవు × 1½ అ. నుండి 2 అ. వెడల్పు × 2 అం. దళముగల బల్లచెక్కలు జారుటకు బాగుండును. వాని అంచులు గుండ్రము చేసి యుండవలెను. వానిని గరుకుకాగితముతోరుద్ది మైనపు పూతతో నునుపుగా నుంచవలెను. బల్ల యొక్క ఒక కొనను మెట్టుపైననో పెట్టెపైననో ఉంచి కిర్రుశబ్దములేకుండ అడుగున ఒత్తుపెట్టవలెను.

8 అ. లేక 10 అ. పొడవు, 12 అ. లేక 15 అం. వెడల్పు 1 అం. దళముగల చెక్కలు (మృదువై వంగునవి) గంతుటకు తగియుండును.

ఎక్కుటకు తగిన ఏర్పాట్లు, ఉపకరణములు:-(Climbing Equipment)

బిడ్డలీ ఉపకరణములకు అలవాటుపడువరకును వారిని జాగ్రత్తగ గమనించుట అవసరము. ట్రెసిల్స్ (Trestles) గాని, ఊగెడు గుర్రములుగాని ఎక్కుటకు తగిన ఉపకరణములు. క్రింద నిచ్చిన నాలుగు ట్రెసిలున్ను ఒక మంచిసెట్టు కాగలవు.

1—8 అం. ఎత్తు × 36 అం. వెడల్పు, 8 అం.

భూమికడ చాచుకొన్న దూరము (Spread at base) ఈ ప్రక్కను ఆ ప్రక్కను ఒక్కొక్క మెట్టు.

1_18 అం. ఎత్తు × 36 అం. వెడల్పు 12 అం. భూమికడ చాచుకొన్న దూరము (Spread at base), ఇటునటు రెండేసి మెట్లు.

1_24 అం. ఎత్తు × 36 అం. వెడల్పు, 24 అం. భూమికడ చాచుకొన్న దూరము (Spread at base) ఇటు నటు రెండేసి మెట్లు.

1_30 అం. ఎత్తు × 36 అం. వెడల్పు, 24 అం. భూమికడ చాచుకొన్న దూరము (Spread at base), ఇటు నటు మూడేసి మెట్లు.

6 అడుగుల పొడవుగల నిచ్చెనలను రెంటిని తీసికొని, భూమిలో 6 అం. లోతువరకు కాంక్రీటుపోసి పాతి వానికడ్డముగా మరియొకదానిని బిగించవలెను. ఈ ఏర్పాటు ఎక్కుటకును ఊగుటకును, ప్రాకుటకును, బల్లచెక్కలను నిలువబెట్టుటకును ఉపయోగముగా నుండును.

కొంత యెత్తున ప్లాటుపారమును దానికి ఇటునటు ఆరు లేక ఎనిమిదేసి మెట్లును కట్టియుండవలెను. ప్రతి మెట్టును 6 అం. ఎత్తును 12 అం. వెడల్పును కలిగి యుండవలెను. మెట్లనుండి క్రిందపడకుండుటకై ఇరు ప్రక్కల ఇనుపకమ్మీల (Railing) ఏర్పాటుండవలెను. మెట్లతుద దిగుస్థలము. 4 అ. × 6 అ. కొలతలుగలిగి యుండవలెను.

ఊగుడు గుర్రము 4 అ. ఎత్తుననుండి ఇటునటు మెట్లను గలిగియున్నచో ఎక్కుటకది ఎంతయు తగియుండును.

బిడ్డలు స్వయముగా తీసికొనిపోవుటకు వీలగు చిన్న చిన్న నిచ్చెనలుండవలెను. వాటర్ పైంటింగ్ వంటి పనులకు వానిని వాడగలరు.

## దుంగలపేర్పు (Logpile):–

పొడవుగ నరికిన మ్రానితుండ్లును (tree lengths), రంపముతో కోసినకర్రకడ్డీలును (Sawed-up poles) దుంగలపేర్పునకు వాడనగును. దుంగలపేర్పుపై క్రీడించుటచే, చేతులకును కాళ్లకును అభ్యాసము కలుగును. కాలిప్రేళ్లకు పట్టుండును.

4 అ. × 3 అ. కొలతలుగల ప్యాకేజీ పెట్టెలు (ఒక ప్రక్క తెరచియున్నవి) ఉండవలెను. మేళ్లు, మేకులు లేచియుండక దృఢముగా నుండవలెను. నాటకపు టాటలకై ఇవి ఉపయోగపడును. మ్రాని పలకలను వీనిపైనుంచి యాడుటకు వీలగును.

## చిన్న పీపాలు, టైర్లు:– దొర్లించి యాడుటకు ఉండవలెను.

లాగుటకు వీలుగ చేతికన్నములుగాని (hand-holes), చేతితో పట్టుకొనుటకు త్రాళ్లుగాని (Rope handles) ఉండి, బోలుగా నుండెడి పెద్ద ఘనములు (Blocks) ఉండవలెను. వాని సైజులు 11 అం. × 11 అం. × $5\frac{1}{2}$ అం. గాని 22 అం. × 11 అం. × $5\frac{1}{2}$ అం. గాని ఉండవలెను. దీనిని ఏ వడ్రంగియైనను చేయగలడు. పెద్ద పెట్టెలనుగూడ వీనికై వాడవచ్చును.

రెండేడ్ల వయస్సు బిడ్డలకు 10 బ్లాకులుండవచ్చును. నాలుగైదేండ్ల వయస్సు బిడ్డలకు 30 బ్లాకులుండవలెను.

వెడల్పుగల ట్రైసికిలు (మూడు చక్రములబండి) త్రొక్కుటకు బాగుండును. బరువులను వేసి త్రోయుటకును లాగుటకును తగిన బండ్లుండవలెను.

డాల్ బొమ్మలు, వానికి తగిన త్రోపుడుబండి యుండిన బాగుండును. (Dolls and doll pram)

## నీటియాట (Water play):–

ఈ యాటకు వీలుగా లోతు తక్కువగుంట యొకటి యుండిన బిడ్డలకెంతో ఆనందముగా నుండును. 3 అడుగుల వ్యాసము 10 అం. నుండి 12 అం. లోతుగల ఇనుప తొట్టె (జింకుపూతగలది) ఈ యాటకు తగియుండును.

నీటి యాటకు తగిన ఆటవస్తువులు:- పడవలు, నీటి జంతువులు, బాతులు, తాబేళ్లు మొదలగునవి.

బుడగల నూదుగొట్టములు:- బంకమట్టి, కఱ్ఱగొట్టములు, లేక పుడకల వంటివి.

వాటరు పైంటింగుకు తగిన డబ్బా, బ్రష్షులు, నీరు జల్లు చిల్లులడబ్బా (watering can) ఇసుక ఆటకు తగిన ఏర్పాట్లు:-

ఇసుక, ఇసుకగోయి (Sandpit) ఇసుక ఆటకై ఆటవస్తువులు మొదలగునవి కావలెను. 4 అ. × 6 అ. × 1 అ. కొలతలుగల ఇసుక తొట్టెను ఈ యాటకై ఇంటియందు వాడవచ్చును. దీనిని భూమి లోనికి దింపుటయో లేక భూమిమట్టమున కొక తొట్టెను కట్టించుటయో చేయవచ్చును. తొట్టె చుట్టును కూర్చుండుటకై పలకరాళ్లను పరిపింప వచ్చును. ఇసుకలో నీరుండరాదు. తొట్టెను కప్పుచుండవలెను. కాని ప్రతి దినమును, కొంత సేపైనను, ఇసుకపై సూర్యరశ్మి పడవలెను.

తోటపనిముట్లు.-తాపీలు,పండ్లకోల (Rake), నీరుజల్లు చిల్లులడబ్బా, ఒంటి చక్రపు త్రోపుడుబండీ (wheel barrow)

బంతులు:-5 అం. నుండి 6 అం. వ్యాసముగల మెత్తని బంతులుండవలెను.

గింజలతో నింపి కుట్టిన సంచులు (Beam bags):-

దట్టమగు గుడ్డతో 4 అం. చదరపు సంచులు కుట్టవలెను. కోణములను గుండ్రముగా కుట్టవలెను. తరువాయి జాబితా వచ్చే సంచికలో నీయబడును.



ఒక తెలుగు పండితుడు తరగతిలో వ్యాకరణము చెప్పుచు "రంగా! రాముడు కుక్కను కొట్టెను" అనే వాక్యంలో కర్త, కర్మ, క్రియలను విభాగంచేసిచెప్పు అని అడిగాడు.

రం:-ఇది అసంభవము మాష్టరుగారూ! - వాడికి కుక్కంటే మహా భయం; వాడెలా కొడ్తాడండీ?

♦ ♦ ♦

బుద్ధిమంతుడులాగ చదువుకోడానికి కూర్చొనియున్న పిల్లవాడిని ఒక పెద్ద మనిషి వచ్చి "అబ్బాయ్! మీ నాన్నగారింట్లో నున్నారా" అని అడిగాడు.

"ఆ మాత్రం మీకు తెలియడంలేదూ! - నాన్నగారున్నది లేనిది నన్ను చూచి తెలుసుకోకూడదండీ! నేను వేరే చెప్పాలా" అన్నాడు.

వేమల కుటుంబరావు



# పేదగీతి

శ్రీమతి S. K. రాజేశ్వరీ రాణి



ఏడవకురా తండ్రి ఏడవకురా!
ఏదున్నాదిరా; నువడిగినబువ్వ?

ఏడుజన్మాల పాపమో ఇలనుమళ్లి
పాడు నరజన్మమెత్తి ఈ అవనియందు
గోడుగోడనుచు మనదరిద్రుల
గోడెవరికి కావాలి; కూడెవరు పెడ్తారు;
భూత, ప్రేత, పిశాచముల గాంచినట్లు మనలన్
చూతురు వాకిట నిలచినంతలో
మోతలా వినపడుత రోమన అరుపులు

కత్తికోతలా బాధపడి కసురుతారు కదర!
కండ్లతో చూస్తారు, కనుసైగలు చేస్తారు
కండలు పెంచిన కాముకులు కొందరు
కానీకి చెయిసాచి అడిగితే నవ్వుతారు
దానా తక్కువలేదు గుడ్డి గుఱ్ఱానికంటారు
అంధుడు నీ తండ్రి అందరి కలుసువాడు, దీన
బంధుడు మన పాలలేడుగా తండ్రి
పాడుసంతాన మిచ్చాడు పాపాత్ములకు వాడు,
గోడుమంటుంటె తిరిగి చూడని వాడురా తండ్రి

ఇల్లిల్లు తిరిగాను ఇసురోమని నేను
ఇల్లాళ్ళు నవ్వారు ననునా బిడ్డనుచూచి
నీకు తోడు బిడ్డ ఎందుకని ఎగిరారు
మేకులాగున్నావు పో పొమ్మన్నారు
కబళ మొక్కింత, కానియైన కాని
ప్రబల ధర్మాత్ము విసిరి వేయ్యరుపోని
ఆర్చుకోమన్నావ దేవుడా, నను మనసు
మార్చుకొని ఇంకా తిరుగమన్నావ;

సంతాన మని అడిగె సంతాన హీనులను
పంతాన చూస్తావు ప్రతిఫల మియ్యవు
అడిగాన ఆర్చాన ఈ బిడ్డల కొరకు
పొగిడాన కలమైన పరమేశ పొరపాటున
ఎందుకోయి సామి దరిద్రులయందు
వందలాది జీవుల వదిలావు ఆక్రిందు
వినరావు, వినలేవు నువు రాతిబొమ్మవు
కనలేవు మాగోడు కన్నుల తెరచుకొని!

ఏడువకురా తండ్రి ఏడువకురా
ఏదున్నాదిరా; నువడిగిన బువ్వ?



# అబ్బాయి పెళ్ళి

"ప్రమత"



[మధ్యాహ్నం పదకొండు గంటలు. సుందరయ్య ఇంట్లో]

సుందరయ్య:_ఏమేవ్ ఇలారా! తమలపాకులు లేవా ఈ రోజు?

సరసమ్మ:_ఉన్నయ్యండి! వస్తున్నా. (తమలపాకుల పళ్ళెంతో వస్తుంది)

సుం:_అవునుగాని, ఈరోజేగదూ అబ్బాయి వస్తా?

స:_అవునండి. ఇవ్వాళే వస్తాడు.

సుం:_ఈ ఏడు వాడి పెళ్ళిచేస్తానే. నేను పెద్దవాడి నయ్యాను.

స:_(నవ్వి) నేను మాత్రం కాలేదా? శకుంతలను చేసికుందాము.

సుం:_ఆ లలితనే చేసికుందాము. మొన్నవాడు లలిత మీద ఇష్టమున్నట్లు మాట్లాడేడు.

స:_మొన్న శకుంతలమీద ఇష్టమున్నట్లు నాతో అన్నాడు.

సుం:_అబ్బ! మీ అన్నకూతురును చేసికుంటామని ఎంతాశ!

స:_మీ చెల్లెలు కూతురును చేసికుందామని లేదా మీకు?

సుం:_అందుకే లలితను చేసికుందాము.

స:_వద్దండి! లలిత బాగుండదు. చదువులేదు; కట్నం రాదు.

సుం:_ఆ శకుంతలకుందా అందము? అయినా అందాన్నేం చేసికుంటావు?

స:_అందము లేకపోతేనేం? చదువుంది.

సుం:_ఎందుకీ గోల తాంబూలాలు పుచ్చుకోటానికి మా బావను రమ్మంటాను.

స:_నే ఒప్పుకోను. ఇవ్వాళే వ్రాయండి మా అన్నయ్యను రమ్మని.

సుం:_ఎందుకు?

స:_ముహూర్త నిర్ణయానికి.

సుం:_నే ఒప్పుకోను, లలితను చేసికుంటాను. ఏ నాడయినా మామగారిని సుఖపెట్టేది అదే.

స:_ఏ నాడయినా అత్తగార్ని సుఖపెట్టేది శకుంతలే!

సుం:_నీకు తెలీదు సరూ! ఊరుకో!

స:_(తమలపాకులు కోపంగా విసిరికొట్టి) మీకు తెలుసు. మీరు మా అన్నయ్యను రమ్మని వ్రాయండి.

సుం:_ఎందుకు మనకీ పోట్లాట అబ్బాయికి ఎవరు ఇష్టమయితే వాళ్ళను చేసికుంటాడు. సరేనా.

స:_సరే.

(వాకిట్లో బండి ఆగిన చప్పుడు చేతిలో బాగ్‌తో భాస్కరం, మాలతి ప్రవేశిస్తారు)

భాస్కరం:_నాన్న!

సుం:_వచ్చావా? రా! ఆ అమ్మాయి ...

భా:_మీ కోడలు-నా భార్య

స:_(ఆత్రంగా)ఆ ... ఆ! ఏమిటి నా కోడలా? ఏమండి చూస్తారేం?

భా:_ఏంచేస్తారు? ఇన్నాళ్లు మీరు చెప్పినట్లు విన్నాను. ఇక వినదలచలేదు.

స:_ఏమిట్రా ఈ మాటలు (విచారంగా) ఆ శకుంతల గతి ఏమిటి?

భా:_మరొకర్ని చేసికోమను. ఇంకానయం ఆ గయ్యాళిని కట్టుకుంటే నా బ్రతుకు తేలిపోయిఉండేది.

స:_ఏంమాటలు రా అవి?

భా:_మాలతీ! బండిపిలు వెళ్ళిపోదాము.

సుం:_ఎక్కడికి?

భా:_నాకు గుంటూరులోనే ఉద్యోగం దొరికింది నాన్నా!

సుం:_ఎక్కడికి వద్దు ఉండు.

మాలతి:_బండివచ్చిందండి!

భా:_వస్తున్నా, నాకుతెలుసు నాన్నా ఇక్కడుంటే అమ్మదగ్గర నిలవలేదు మాలతి.

స:-ఆ మాటనిజమే! (కసిగా అంటుంది)

భా:_మాలతీ నాన్నకు నమస్కారం చేసికా.

మా:_(నమస్కరిస్తుంది) వెళ్ళొస్తామమామయ్యా!

సుం:_శుభంగా పోయిరాతల్లీ.

(భాస్కరం మాలతి నిష్క్రమణ)

సుం:_అబ్బాయిపెళ్ళి సమస్య తేలిపోయింది. ఇంకా విచారించకు.

స:-ఓనాడువిచారించానుగనక నా!

సుం:_అంతేలే!



ఒక తరగతిలో నీతి కథలు చెప్పుతున్న ఉపాధ్యాయుడు "మీలో నెందరికి స్వర్గమున కెళ్ళడాని కిష్టమో చేతులెత్తండి" అన్నాడు విద్యార్థుల నుద్దేశించి.

తరగతిలో నందరు ఒక్క బాలుడుతప్ప చేతులెత్తారు.

మాష్టరు "గోపాల్! నీకు స్వర్గానికి వెళ్లడం యిష్టంలేదన్నమాట!" అన్నాడు.

"ఇష్టములేకేమండీ! - కాని....మా అమ్మ స్కూలు వదలగానే సరాసరి యింటికి వచ్చెయ్యమంది."

వేముల కుటుంబరావు

# ప్రతిబద్ధ సింహిని

శ్రీ పోలూరి హనుమజ్జానకీ రామశర్మ



[1854 మార్చిలో ఆంగ్లప్రభుత్వము దత్తపుత్ర విధానమును నిరాకరించి ఝాన్సీ రాజ్యమును స్వాయత్తము గావించుకొనెను. రాజ్యచ్యుతయైనది రాణీ లక్ష్మీదేవి.]

అనాథయైనది ఝాన్సీ రాజ్యము
హరింపనదనని యాంగ్లప్రభువులు
కుటిలమార్గములఁ గోవిదులగుచును
రాజ్యసంపదల హరియింపగా ॥

రాజ్యహీనయును సేనాహీనయుఁ
బరికరహీనయు విభవచ్యుతయై
యాంగ్లప్రభువుల కనువర్తినియై
కాలవర్తనముఁగని నిర్వేదమ్మునఁ
బోషణకొఱకై భరణము నందుచు
రాణీలక్ష్మియు దుఃఖితయై॥

వ్రతనియమమ్ముల వైరాగ్యమ్మున
శాంతచిత్తమున మెలఁగుచు నుండియు
స్వాతంత్ర్యోద్యమ సమరపద్ధతుల
నుదాత్తగతి మైనుజ్జ్వల రీతుల
భావనసేయుచు యథాకాలముగ
సల్పుచు నుండెను యత్నములన్ ॥

దిలీపసింహుఁడు జవహార్ సింహుఁడు
మొదలగు ముఖ్యులు జాగీర్దారుల
నప్పటప్పటికి నేకాంతమ్మున
సమావేశముల సంబోధించుచు
వివిధరాష్ట్రముల వేద్యాంశమ్ముల
సేకరించుచును జర్చలు సేయుచు
స్వతంత్రతోద్యమ దీక్షాభావము
నాఁడు నాఁటికిని బలపఱచెగా ॥

ఆయుధవిద్యలఁ గడునియమమ్మునఁ
బరిశ్రమించుచుఁ బలువురఁ గూర్చుచు
స్త్రీలును నైతము నైనిక శిక్షణ
యుద్ధపద్ధతుల యోద్ధలఁ జేయుచు
స్వతంత్రతోద్యమ జాగరూకయై
ప్రతిదిన సంచిత ఫలసార్థకయై
యాంగ్ల ప్రభువుల మైత్రినివీడక
కాలము గడుపుచు నుండంగా ॥

("ఝాన్సీ లక్ష్మీదేవి" యను కావ్యమున "ఝాన్సీపాలన" మను చతుర్థ సర్గమునుండి)



# మారిన మనిషి

శ్రీ ఎస్. చంద్రశేఖర్

(గత సంచిక తరువాయి)

ఈ మాట వినేసరికి కన్యాలాల్‌కు మూర్ఛవచ్చినంతపనైంది. గొంతుకలో పచ్చివెలక్కాయ పడినంత పనైంది. అతని దగ్గర ప్రస్తుతం డబ్బులేదు. ఏమీ తోచడం లేదు. ఏమైతే అయిందని–

"నేను మీ డబ్బు తర్వాత యిస్తాను, ప్రస్తుతం నా దగ్గర లేదు" అన్నాడు ఎట్లాగో.

"వీల్లేదు నాకిప్పుడే కావాలి, యివ్వడంటే తక్షణమే కావాలి" అని ఉరిమాడు గోవిందలాల్.

రుక్మిణమ్మకు ఉక్రోషం పొంగిపొర్లింది. "దొంగవెధవా? నీకు సిగ్గులేదూ. తీయని మాటలుచెప్పి మా దగ్గర డబ్బుతీసుకొన్నప్పుడు బాగుందేం! యివ్వమన్నప్పుడు నీ దగ్గరలేదు' మమ్మల్ని మోసంచేద్దామనుకొన్నావా! ఛీ! కుక్కా! ఛీ! ఛీ కుక్కలకొడకా! నీ దంతా కుక్కజాతిరా! మేం యిచ్చిన డబ్బు యిచ్చేయ్" అంటూ నోటికివచ్చినట్లల్లా తిట్టింది. జరిగిన పరాభవానికి ఆమెకు ఏడుపు పొంగి పొర్లింది. అతనిమీద కోపంతీరక అతన్ని పిడికిలితో కొట్టడానికి ముందుకుపోయింది.

కన్యాలాల్‌కు తల కొట్టేసినట్లయింది. ప్రత్యక్షంగా కాబోయే అల్లునిముందు, తనకు పరాభవం జరగడం సహించలేక పోయాడు. ఆత్మాభిమానం ఉరకలుగా పొంగింది. ఇక ఉండబట్టలేక.

"ఛీ! పోవే పిచ్చిముండా!" అంటూ మీదకు వస్తున్న రుక్మిణిబాయ్‌ని క్రిందకు తోసేశాడు.

ఆ దృశ్యం చూచేసరికి గోవిందలాల్‌కు కోపం ప్రకోపించింది. తన తల్లిని, తన ఎదురుగా పరాభవించడం సహించలేక పోయాడు. ఒక సారిగా కన్యాలాల్ మీద పడి గొంతుకపట్టుకున్నాడు. యిద్దరూ పెనగులాటలోకి దిగారు. చీకటి దట్టంగా అలముకుంది. దుర్గాదాస్‌కి ఏమీ చేయడానికి తోచలేదు. కాని తనకు కాబోతున్న మామగార్ని పరాభవించడం చూడలేక ఒక దుడ్డుకర్ర తీసుకొని గోవిందలాల్ అనుకొని ముగ్గుర్ని చావబాదటం మొదలు పెట్టాడు. ఆ కొట్టడంలో ఒక దెబ్బ రుక్మిణిబాయ్ నెత్తిబద్దలుచేసేటట్లు చేసింది. ఆమె 'అయ్యో' అంటూ మెలికలుతిరిగి పడిపోయింది. దాంతో దుర్గాదాసుకు భయంవేసింది. చేతిలో దుడ్డుకర్ర అవతలపారవేసి, ఏమీ ఎరగనట్లు–

"ఏంచేసావో చూడు – ఎంతపనిచేసావురా దొంగవెధవా?" అంటూ గోవిందలాల్‌ని తిట్టటం మొదలుపెట్టాడు.

గోవిందలాల్ కన్యాలాల్‌ని వదిలి ప్రక్కనే మెలికలు తిరిగిపడిపోయిన తల్లి దగ్గరకుపోయి ఆమె తలను ఒళ్లోపెట్టుకొని,

"అమ్మా ... అమ్మా!" అని పిలిచాడు. కాని ఆమె పలకలేదు.

"అమ్మా ... " అని మరోసారి పిలిచాడు కాని ప్రయోజనం శూన్యం. అప్పటికే ఆమె ప్రాణం అనంతవాయువుల్లో లీనమైపోయింది. గోవిందలాల్ ఆమె చనిపోయిందని తెలుసుకొని బోరున ఏడ్చాడు. ఆ గొడవకు నలుగురూ చుట్టుమూగారు. దుర్గాదాస్ అదే సమయమన్నట్లు.

"చూడండి! వీడికి మతిభ్రమణం కలిగి తల్లినే ఎట్లా చంపుకున్నాడో" అంటూ ప్రచారం చేయడం మొదలు పెట్టాడు. గోవిందలాల్‌కు అవన్నీ చెవికెక్కలేదు.

కొంత సేపటికి పోలీసులుకూడా ఆ స్థలానికి ప్రత్యక్షమెయ్యారు. గోవిందలాల్ వారికి ఏమీ సంజాయిషీ చెప్పలేదు.

దుర్గాదాస్ కలుగజేసుకొని "ఆ తల్లీ కొడుకులు ఏదో వాదించుకొంటూ మా దగ్గరకు తీర్పుకొచ్చారు. గోవిందలాల్ కోపంపట్టలేక దుడ్డుకర్రపుచ్చుకొని తల పగల కొట్టాడు. తర్వాత కన్యాలాల్ మీదకూడా ఏదోకోపం మీద, మీద పడబోయాడు. అంతలో నలుగురూ వచ్చారు. వాళ్ళను చూచి యీవిధంగా దొంగ ఏడ్పుఏడుస్తున్నా"డని చెప్పాడు.

డిప్యూటీ సూపరింటెండెట్ నేరం గోవిందలాల్ మీద బలంగా మోపాడు. విచారణలోకూడా గోవిందలాల్

"తను అమ్మమీద ఎటువంటి అఘాయిత్యం తలపెట్టలేదు. తనకు కన్యాలాల్ చేసిన అన్యాయం వివరించాడు. తన తల్లి చనిపోవడానికి వాళ్లిద్దర్లో అంటే కన్యాలాల్, దుర్గాదాసుల్లో ఎవరైంది తాను చెప్పలేనని చెప్పాడు.

దుర్గాదాస్, కన్యాలాల్ కలసి గోవిందలాల్ మీద నేరాన్ని బలంగా మోపారు. గోవిందలాల్‌తరఫున వాదించడానికి వచ్చిన న్యాయవాదికూడా గోవిందలాల్‌కు అనేక విధాలుగా నచ్చచెప్పి, అతని తల్లిని ఎవరు చంపిందో చెప్పమని వత్తిడి చేసాడు. కాని గోవిందలాల్ తను కన్యాలాల్ దెబ్బలాడటంలో మునిగి పోయినట్లు తప్ప, తనతల్లి చనిపోవడానికి ఎవరు ఏ విధంగా కారకులో చెప్పలేనని చెప్పాడు. యింక న్యాయవాది ఏమీచేయలేక తనకు తోచినట్లుగా వాదించాడు. కాని ఆవాదన గోవిందలాల్‌ని నిర్దోషిగా నిరూపించలేక పోయిన ఫలితంగా పదిసంవత్సరాల కారాగారం ప్రాప్తమైంది.

♦ ♦ ♦

ఒక రోజున దిలీప్‌సింగ్ బావిదగ్గర

ఆడుకొంటుంటే అక్కడే ఒక వింతవ్యక్తి భావిలో నీళ్ళుతోడుతున్నాడు. అతని బుగ్గ మీద వికృతంగా ఓ పెద్దమచ్చ భయంకరంగా కనబడుతోంది. దిలీప్ అతని దగ్గరకు వెళ్ళి

''ఏయ్! నీదేవూరు'' అని ముద్దుగా అడిగాడు.

''అన్ని వూర్లూ నావే!'' అన్నాడు.

''మరి నీ సామానేది'' అనడిగాడు.

''లేదు'' అన్నాడు.

''మరి నీవెక్కడ పడుకొంటావు'' అని మళ్లీ అడిగాడు.

''యిక్కడే'' అన్నాడు ఆవ్యక్తి, ఆ చిన్నారి ముద్దుపలుకల వింటూ.

''అయితే నేను తినే చపాతీలలో నీకూ పెడతాను, యిక్కడే వుండు'' అంటూ యింటిలోకి వెళ్లి పోయాడు.

కొంతసేపటికి దిలీప్‌సింగ్ రెండు చెపాతీలు దానిలో పప్పువేసుకొచ్చి ఆ వ్యక్తికిచ్చాడు.

ఆవ్యక్తి అవితింటూ దిలీప్‌తో మాట్లాడుతూకూర్చున్నాడు. అంతలో ఒకస్త్రీ దిలీప్‌ను పిలిచింది.

''అమ్మ పిలుస్తుంది వెళ్తా''నంటూ వెళ్లి పోయాడు.

ఆమె దుర్గనందిని. దిలీప్ ఆమెకొడుకు. ఆమెభర్త దుర్గాదాస్. ఆలోచిస్తున్నకొలది ఆ వింతవ్యక్తి మొహం వికృతంగా మారడం మొదలు పెట్టింది.

ఆ రాత్రి దుర్గాదాస్ మంచంముందు ఒక బలిష్ఠమైన వ్యక్తి దుడ్డుకర్ర చేత్తో పట్టుకొని నిలబడ్డాడు. అతనికళ్ళు నిప్పు కణాల్లామండుతున్నాయ్. దుడ్డుకర్రతో దుర్గాదాస్‌ను చావబాదాలని ఎత్తాడు. కాని దిలీప్ తల్లిపక్కలో అమాయకంగా పడుకునియున్నాడు. తను ఈ రోజున దుర్గాదాస్‌ని చంపితే రేపు తండ్రిలేనివాడౌతాడు. ఒక్కసారిగా మనస్సు వికలంచెందింది. దుడ్డుకర్ర అక్కడే పడేసి చీకట్లో అంతర్థానమైపోయాడు.



# సహకారము

శ్రీ గాడేపల్లి శంకరం

## సహకారము

ఐకమత్యమే బలము. అనైక్యతే అనర్థాలకు మూలము. వ్యక్తి సంఘముకోసము జీవిస్తాడు - సంఘము వ్యక్తికోసం పాటుపడుతుంది. ఈ రెండింటికీ అవినాభావసంబంధమున్నది. వ్యక్తి సంఘముతో సహకరించి పనిచేస్తే - ఒక వ్యక్తి గతాభివృద్ధియేకాకుండా - మొత్తం సంఘమే అభివృద్ధి చెందటానికి అవకాశం వుంటుంది. వ్యక్తి సాధించలేనిపనిని సంఘము సాధిస్తుంది. సంఘాభివృద్ధికి సహకారపద్ధతి పట్టుకొమ్మ. సహకార పద్ధతిని సాధించలేని పనివుండదు - నిర్మించలేని సంస్థవుండదు - ఎంతటి ఘనకార్యాన్నైనా సులువుగా సాధించవచ్చు - సుఖంగా అనుభవించవచ్చు - ఆర్థికంగా - సాంఘికంగా రాజకీయంగా ఒండొరులు సహకరించుకొని - సమానభావంతో సంచరిస్తే - గ్రామాల పునర్నిర్మాణముగాని - గ్రామ ప్రజల పురోభివృద్ధిగాని - నిమిషంలో జరుగుతుంది - జరిగితీరుతుంది - అందుచేత గ్రామాలలో సహకారపద్ధతిని ప్రవేశపెట్టాలి. ప్రజలే ఒకరినొకరు సంప్రదించుకొని - సకలార్థసాధకమైన సహకార సంఘములు ఏర్పాటు చేసుకోవాలి. ప్రజల సహకారములేనిదే ప్రభుత్వముచేసే ఏర్పాటుల ప్రయోజనముండదు - గ్రామంలోని ప్రజలందరికి కావలసిన - ఆరోగ్యము - వైద్య సహాయము - విద్య - గ్రామపారిశుద్ధ్యము - రోడ్ల నిర్మాణము - గృహనిర్మాణము మొదలైన సమస్త సౌకర్యములు - పరపతి సంఘములద్వారా సమకూర్చుకోవచ్చును - ప్రభుత్వముమీద ఆధారపడవలసిన అవసరమే వుండదు - ప్రభుత్వమువారు తగిన ప్రోత్సాహమును - తగుమాత్రము ధనసహాయమును చేసిన చేయగలరు. అంతకుమించి వారు చేయునది వుండదు - ప్రజలే తమ గ్రామమునకు కావలసిన సమస్త సదుపాయములను - ఈ సహకార సంస్థల ద్వారా - స్వయం కృషితో చేసుకోవచ్చును.

పంచాయితీ బోర్డుకూడ - సహకారసంస్థవంటిదే. గ్రామపారిశుధ్యమునకే పరిమితముకానక్కర్లేదు - పాఠశాలలు - వైద్యశాలలు - మాతా శిశురక్షణాలయములు - పార్కులు - పరపతి సంఘములు - రాకపోకల సౌకర్యాలు - రహదారీ బంగళాలు - ఏర్పాటుచేసుకోవచ్చు - చివరకు పోలీసు సిబ్బందీని న్యాయస్థానములనుకూడ ప్రజలే ఏర్పాటుచేసుకొని నడుపుకోగలరు. నాగరికత బలిసినదేశాల్లో - ఈ సంస్థలను పంచాయితిలే నడుపుతున్నాయి - ఇంగ్లండులో అంతే.

గ్రామ ప్రజలు - సహకార పద్ధతిన గృహములు నిర్మించుకోవచ్చును. ప్రతి గృహస్థుకీ గృహం ఉండాలికదా! "ఇల్లు కట్టిచూడు పెళ్ళిచేసిచూడు" అన్నారు అంటే ఇల్లు కట్టుకోవాలన్నా - పెళ్ళి చేసుకోవాలన్నా - చాలా వ్యయప్రయాసలతో కూడినపని యన్నమాట - పరపతి సంఘాలు - భీమాకంపెనీలద్వారా-ఇంతటి వ్యయప్రయాసలకు లోనైన కార్యాలైనా ఎంతో సులభంగా సాధించుకోవచ్చు. గృహనిర్మాణ సంస్థలు - పరపతి సంఘాలు - బాంకులు - భీమాకంపెనీలు చిన్న యెత్తున ప్రతి గ్రామంలోను ఏర్పాటుచేసుకోవచ్చును. లేదా పది గ్రామాలకొకటి చొప్పున నిర్మించుకోవచ్చును-ఒక్కసారి కావలసిన మొత్తాన్ని ఈ సంఘాలు అప్పుగా యిస్తాయి - రెక్కల కష్టంమీద కొంచెము కొంచెముగా అప్పుతీర్చుకొంటూ - కొంతకాలానికి ఋణవిముక్తినిపొంది - నిర్మించుకొన్న ఇల్లు స్వంతము చేసుకోవచ్చు - అప్పుతీర్చే కాలపరిమితిని - నెలకో

సారియనిగాని - మూడుమాసములకొక తూరియనిగాని - సంవత్సరానికింత కాలంఅనిగాని నిర్ణయించుకొనుటకు - పది మొదలు ఇరువది సంవత్సరాల అయ్యే అవకాశముంది. అయితే ఈ సంస్థలను ఉపయోగించుకునేవారు - బాంకులో డబ్బు దాచుకోవడం - పొదుపుగా ఖర్చుచేయడంకూడా అలవాటు చేసుకోవాలి. అసలు ఈ సంస్థలతో వ్యవహరించటం మొదలుపెట్టితే - పొదుపుగా వాడుకునే అలవాటు స్వాభావికముగానే కలుగుతుందిలెండి! పరిస్థితులు అట్టి జాగరూకతను నేర్పుతాయి - తప్పనిసరిగా డబ్బు దాచుకొనే మార్గాలు - వృద్ధాప్యంలో సుఖజీవనానికి సదుపాయాలు వాటి పద్ధతులు తెలుస్తాయి. ఈ సహకార సంస్థలు రెండు రకములైన ఋణాలను మంజూరుచేయగలవు-దీర్ఘకాలిక ఋణములనీ - తాత్కాలిక ఋణములనీ వున్నాయి—వృత్తికి కావలసిన పెట్టుబడులు — ముడిసరకులు తెప్పించుకొనుటకు వలసిన పైకము — బావులు త్రవ్వించుటకు— ఎద్దులను కొనుక్కొనుటకు — విత్తనములు తెప్పించుకొనుటకు — సహకార సంస్థలు తాత్కాలిక ఋణములను తక్కువ వడ్డీకి యీయగలవు — పంట పండిన తరువాతగాని — సరుకును విక్రయించిన వెంటనేగాని — ఈ ఋణములను తీర్చివేయవచ్చును. వివాహములకు — విద్యా సౌకర్యములకు భీమాసంస్థలద్వారా పాలసీలను తీసుకొని — సదుపాయమును పొందవచ్చును — ప్రతిమాసము - కొంచెము కొంచెముగా ఈ సంస్థలలో దాచుకొని పెద్ద పెద్ద చదువులను — విపరీతపు ఖర్చులతోకూడిన వివాహాది శుభకార్యాలను సాధించవచ్చును—

గ్రామ ప్రజలు సహకార పద్ధతిని నిర్మించిన సంస్థలను, ఉపయోగించు విధానమును తెలుసుకొని దానికి అలవాటుపడిననాడు — ఆర్థికముగా క్రుంగిపోవుటకుగాని నైరాశ్యమును చెందుటకుగాని — అవకాశముండదు.

గ్రామప్రజలు సహకార పద్ధతిని సాధించలేని పని వుండదు గనుక ప్రజలందరూ పాల్గొనేపద్ధతి వుండాలి. పల్లెగ్రామాలలో సాధారణముగా డబ్బు చేతిలో వుండదు. అటువంటప్పుడు — వస్తురూపంలోగాని, శ్రమదానం చేసిగాని - అందరూ పాల్గొని — 'రోడ్ల నిర్మాణము' - 'పాఠశాలలు' - 'పఠనమందిరములు' - 'మాతాశిశురక్షణాలయములు' — 'వైద్యశాలలు' - 'ఆరామములు' - 'అతిథిగృహములు' - మొదలైనవన్నీ - ఏర్పాటుచేసుకోవాలి. వృత్తులకు కావలసిన పెట్టుబడులు పరపతి సంఘములోనో సహకార బ్యాంకులోనో అప్పుగా తీసుకోవచ్చును. ముడి సరుకులు తెప్పించుకోవచ్చును. తయారైన సరకులు సరియైన ధరకు అమ్ముకోవచ్చును. వ్యక్తిపరంగా సాధ్యము కాని అనేక గొప్పకార్యములు, సహకార పద్ధతిని సాధించి అందరూ అనుభవించవచ్చును -

సహకార పద్ధతికి మూలాధారమైనది సహకార భావనము. ఇది గ్రామంలోని అశేషజనము అలవరచుకొని ఈ సంస్థలలో సభ్యులు కావాలి-ఈ భావన ప్రజలలో లేనినాడు — ప్రభుత్వమువారు బలవంతముగా ఈ సంస్థలను ఏర్పాటుచేసినా - అవి నామమాత్రవశిష్టములై నష్టదాయకముగా కూడా పరిణమించగలవు. పదిమంది పెద్దలుమాత్రమే బాగుపడటానికి కాదు, పరపతిసంఘాలు - పల్లెలోని ప్రజలందరూ బాగుపడాలి - వారంతా ఈ సంఘాలలో పాల్గొన్నప్పుడే — సహకారు సంస్థలు సార్థకమవుతాయి - పల్లెప్రజలు బాగుపడతారు - ఆనాడు గ్రామపునర్నిర్మాణము — సుసాధ్యము — పురోభివృద్ధిత్వరితము - అవుతుంది.

కేంద్ర ప్రభుత్వమువారుకూడ ఈ విషయమును గుర్తించారు. వ్యవసాయసహకార సంఘాల స్థాపనకు పూనుకుంటున్నారు. ఒక్కొక్కదానిలో 50 మంది మొదలుకొని 100 మంది రైతులవరకూ సభ్యులుగా చేరి వ్యవసాయమునకు కావలసిన అప్పును తీసుకొనవచ్చును. ఇట్లా సహకార పంఘములో అప్పుతీసుకొనిన ప్రతిరైతు - తనపంటను సొసైటీ ద్వారానే సరియైనధరకు అమ్ముకొనవచ్చును — ధాన్యాలను

గిడ్డంగులవద్ద అప్పగించిన వెంటనే రైతులకు ప్రభుత్వం ఆర్థికసహాయముకూడా చేస్తుంది. గింజలు అమ్ముడు పోయేవరకూ వేచియుండనవసరము లేదు.

రైతు, లోకంలో — గ్రామీణప్రజలలో విశ్వాసాన్ని పెంపొందించవలసిన అవసరాన్ని ప్రభుత్వం గుర్తించింది — సహకార సంఘాలకంటె మామూలు వడ్డీ వ్యాపారులవద్ద అదునుకు అప్పుదొరుకుతూ వుండటంచేతనే రైతు అతనిదగ్గరకే పరుగెత్తుతున్నాడు — ఈలోటును ప్రభుత్వసహాయంతో భర్తీచేసి — సహకార సంఘాలద్వారా — సకాలంలో రైతుకి ఋణములిచ్చే పరిస్థితిని ప్రభుత్వం కలుగచేయాలి.

గ్రామపునర్నిర్మాణంలో — సహకారముద్వారా ఆర్థిక విప్లవాన్ని అన్నిరంగాలలోను సాధించటానికి వీలుంటుందన్న విషయం విజ్ఞులందరూ ఎరిగినదే. అయితే దీనికి బహుళ ప్రచారము ప్రభుత్వసహాయము అవసరమని మాత్రము చెప్పకతప్పదు.

గ్రామాలలో సహకార సంస్థలు ఏర్పడి సమస్తమైన పనులు జరుగుతున్ననాడు — సోషలిజంతో కూడిన సామాజికవ్యవస్థ స్థాపించబడినట్లే.

# సంఘమిత్ర

శ్రీమతి నిర్మల



పురాణ కాలములోను, ఇతిహాసకాల మునందును వర్తమానకాలములోను, మన భారతమహిళాలోకమున మహాపతివ్రతలు, త్యాగజీవులు, సాహస చక్రవర్తినులు ఎందరో జన్మించి యుండిరి.

వారు ఆనాడు ఈనాడు ఏనాడో అని, కాలభేధము లేక, ఎల్లకాలములలోను, ఆడ మగఅను జాతిమత భేధములులేక, అందరికిని పూజ్యులే.

మన భారత నారీమతల్లులలో, ఇతర మతస్థులుకూడ కలరని చెప్పుటకు, భారతీయులైన మనము అందు ప్రత్యేకముగా మన స్త్రీజాతి గర్వించవలసిన విషయము.

భారతమాత బిడ్డలైన మనకు తప్ప ఏ భూమాత సంతతికిని, అంతటి మహా భాగ్యము పొందు అవకాశము అరుదగుటయే అందుకు కారణం.

అట్టి నారీమణులలో ఇతిహాసకాలపు మణియైన ఒక మహామహిళ జీవిత సంగ్రహమే ఇందలి కథావస్తువు.

♦ ♦ ♦

ఏ మహా చక్రవర్తి హిందూ మతస్థుడై జన్మించి, దాన వీరధర్మప్రియుడని ఖ్యాతి గాంచి, రాజ్యకాంక్షచే రక్తనదులు పారించి, వాటినిగాంచిన క్షణముననే, అహింసామూర్తియై, అహింసాప్రధానోద్దేశ్యముగాగల బౌద్ధమతమును స్వీకరించి ఆ బౌద్ధమతప్రచారముకొరకు, చైనా జపాన్, సిరియావంటి దూరదూర దేశములకు సహితము ప్రచారకులను, బౌద్ధ బిక్షుకులను పంపించి ప్రచారముగావించి, ఆ మతమునకానాడు ప్రపంచమున మహోన్నతస్థానము లభింపచేసెనో ఆ మహావ్యక్తి కుమార్తెయే మనమహా మహిళ.

ఆ మహావ్యక్తి అశోకచక్రవర్తిగాక మరెవరు? ఆ నారీమణి ఈతని కూతురనిన ఆశ్చర్యమా!!

♦ ♦ ♦

పురుషులు పూజ్యులగుటకు కారణం ఎప్పుడు ఏవిధమైనను స్త్రీ లోకమున పతి భక్తిచేతనో దైవభక్తిచేతనోపతివ్రతలైన వారే ఎక్కువ కాని, దేశసేవకొరకు మానవ సేవకొరకు తమ జీవితములు అర్పించిన

మహిళలు నేటికాలముసకన్న ఆపురాణ ఇతిహాస కాలములందు బహుతక్కువనుట ఏమియు సత్యవిదూరముకాదు.

పురాణకాలమందు అసలు ఇటువంటి వారు లేరేమోననుట సాహసమే అయినను అసృతము మాత్రముకాదు.

ఇటు వర్తమానకాలమునకును అటు పురాణకాలమునకును ఆదర్శజీవియై ఇతిహాసకాలమున మనిన వ్యక్తికుమారి సంఘమిత్ర.

♦ ♦ ♦

బౌద్ధధర్మములనినను బౌద్ధమత ఉపదేశకులనినను సంఘమిత్రకు అమిత భక్తి, అంతులేనిప్రేమ, ఆమె మనస్సున పవిత్ర భావములు కలుగుటకు కారణం.

ఆమె చిన్నతనమునుండి బౌద్ధమతోద్ధారకుడైన తన తండ్రి ఆశోకుని చెంత నుంటూ, అతనితో ఎవరైనా, బౌద్ధధర్మములను గూర్చి చర్చించుటగాని వాటిని విపులముగా వివరించుటగాని ఆమె ఎల్లప్పుడూ వినుచుండుటయే అందులకు కారణం.

ఆమె వయస్సు ఏవిధంగా పెరుగుచుండెడిదో ఆ తీరుగానే ఆమె హృదయమున బౌద్ధ ధర్మాలను ఆచరించుటయందు వాటిని ఇంకను విపులముగా తెలుసుకొనుటయందు ఆసక్తి పెరుగుచుండెడిది.

మానవ మాత్రులకేగాక ఏ జీవికీ హానికల్గించరాదని బోధించే బౌద్ధధర్మాన్ని సేవిస్తూ, మహత్తర ప్రేమ పూరితమైన ఆ బౌద్ధమత సూత్రాలను వాటి విలువలను మానవుల అందరకు తెలియచేసి వారి నుద్ధరించుటకన్న తను వారికి చేయు సేవ ఏమిటని ప్రశ్నించుకొని.

తను మానవజన్మ ఎత్తినందులకు తను జన్మను సార్థకపరచుకొనవలెననిన మానవ సేవయే మాధవస్వేవగా నెంచి మానవులను సేవించుటయే విధియని నిశ్చయించుకొన్నది. అటులచేయుటకే తనజీవితమును అర్పించుకొన్నది.

ఆమె అట్లు తనజీవితమును సంఘముకొరకు అర్పించి ఆనాటికి జరిగిజరుగుచున్న స్త్రీలోకమున ఒక నూతనయుగమును ప్రారంభించినది. అంతియేగాక భవిష్యత్ మహిళాలోకమునకు పౌరోహిత్యము వహించినది.

తన దీక్ష సవ్యముగా నెరవేరుటకుగాను జీవితాంతమువరకు, కుమారి బ్రహ్మచారిణిగా ఉండునట్లు ప్రతిజ్ఞచేసుకొన్నది.

"సార్థకనామురాలేగదా! త్యాగ జీవి సంఘమిత్ర" (ఈనాటి బ్రహ్మచారిణీ బ్రహ్మచార దీక్షావ్రతుల్లో కొందరు ఆమె కాలిగోటికైనను సరిపోలరేమోగదా!)

సంఘమిత్ర తన ఆశయమును ఆచరణ

లోచూపుటకుగాను బౌద్ధమత ప్రచారముచే ప్రజలనుద్ధరించుటకై తన తండ్రి అశోకుని ఆజ్ఞగైకొని సోదరుడైన మహేంద్రుని తోడుగా తీసుకొని, కొందరు బౌద్ధభిక్షుకులతో లంకకు ప్రయాణమయినది.

◆ ◆ ◆

నాడు నేటివలె మోటారు రైలుబండ్ల వంటి యాత్రాసదుపాయములుగాని, చక్రవర్తి కుటుంబములకైనను నేటివలె విమాన సౌకర్యములుగాని అప్పుడు లేవు.

సంఘమిత్ర పయాణమయినలంక, వారి నివాసమైన, మగధకు వందలకొలది మైళ్ల దూరమున ఉన్నది.

గుట్టలు మెట్టలు అడవి మృగములతోను నిండియుండి, కాలిబాట కానరాని కీకారణ్యములతోను, బందిపోట్లు భయముతోను భయంకర మృగములతోను ఉండు చిట్టడవులతోను ఆ వందలకొలది మైళ్ళలో చాలాభాగము నిండియుండును.

ఆ మార్గము ఎంత భయానకముగా నున్నను ఎన్ని కష్టనష్టములు కలిగినను అప్పుడుకూడా సముద్ర నౌకా సౌకర్యము లున్నను, తన సుఖముకొరకై మగధనుండి లంకకు ఓడలపై పోక, లంకకు మగధకు మధ్య భూమార్గమునగల, ప్రజలకు బౌద్ధ ధర్మ సూత్రాదులు బోధించి వారి నుద్ధరించుటకై, ''రాజభవనములలో పెరిగి ఎనలేని రాజ్యసుఖ భోగముల ననుభవించిన ఆసంఘమిత్ర, 'బ్రతుకుపై ఆశ లేనివారు కాలిడు అరణ్యములతో' నిండియున్న ఆ బహు భయానక దూరమెల్ల కాలినడకన ప్రయాణముచేసినది. అటులనే బౌద్ధధర్మ ప్రచారముతో లంకకు కొంతకాలమునకు చేరుకొన్నది.

పదవులకొరకు, భూగృహ పూజల కొరకు, శిష్య జంజాటములకు పాదపూజల కొరకుగాక, మతముకొరకు, ధర్మము కొరకు, పతిత జనోద్ధరణకు తమ జీవితములను అర్పించితిమని చెప్పుకొను నేటి ఏ ఆశ్రమాధిపతికో మఠాధిపతికో సంఘమిత్ర చేసినటువంటి ప్రయాణములు కల్పించినచో ఎన్ని ఆశ్రమమఠాదులకు అధిపతులు లేకుండా పోవునోగదా! సత్వ సంఘ పరిత్యాగులమని చెప్పుకొనుచు, సంసారులను మోసగించుచు పొట్టలు పోషించుకొనెడి ఈ నాటి సన్యాసులలో 'సన్యాసులు' భ్రష్టులు ఎందరో చెప్పలేము కాని నిజసన్యాసులు మాత్రము బహు అల్పము.

ఎన్నో కష్టనష్టములకోర్చి అటువంటి ప్రయాణముచేసిన ఆ పూజ్యమహిళ కేగాక యావత్ స్త్రీ లోకమునకు గౌరవప్రదమైన విషయము.

◆ ◆ ◆

**ఎప్పుడైనా ఎచ్చటైనా ఎవరైనా ఒక**

క్రొత్తవ్యక్తి చెప్పినమాటలునమ్మి వెంటనే ఆచరించి ఆదరించుట అరుదైన విషయము గదా ?

అటులనే లంక ప్రజలుకూడ నెమ్మది నెమ్మదిగా కొందరు కొందరే సంఘమిత్ర చెప్పు విషయములనునమ్మి ఆచరించుచు ఆదరించుచుండిరి.

నిష్కామ బుద్ధితో ఆమెచేయు ఉపదేశముల ప్రభావమువల్ల అచటి ప్రజలు కొంతకాలమునకు ఎక్కువగానే ఆకర్షింపబడుచుండిరి. అటులనే వేలకొలది జనులు ఆమె చెంతకుచేరి బౌద్ధధర్మదీక్షను గైకొనుచుండిరి. 'అన్ని రంగములలోను నిష్కామ సేవయే మానవజీవిత పరమధర్మముగదా?'

సంఘమిత్ర చక్రవర్తి కుమార్తెయైనను ఆమె దృష్టిలో భాగ్యవంతులు బీదలు అను భేదభావమేలేదు. అందరూ సమాన జీవులే. వారందరికి మత ధర్మములను తెలుసుకొనుటకు సమానహక్కు ఉన్నది. వారి శ్రద్ధయే వారి హక్కులకు శక్తిని నిచ్చును.

ఇందుచే 'కుమారి సంఘమిత్ర' లంకా రాజ్యమున ఎచ్చటకు వెళ్లినను ప్రజల హృదయపూర్వక ఆదర సత్కారములే ఆమెకు స్వాగతము చెప్పెడివి. ఆమె ఉపదేశములనిన అచటి ప్రజలకు అమిత భక్తి, నిజమగు శ్రద్ధ ఉండెడిది.

అట ఆమె ఎచటికి వెడలినను సుస్వాగతమే. సంఘమిత్ర భోధనా ప్రభావము వలననే లంకాద్వీపమునకు రాణియైన 'అనుజాదేవి', సుప్రసిద్ధమహిళలు బౌద్ధ మతస్థులైరి. "యథారాజా తథాప్రజా."

రాజ కుటుంబమే బౌద్ధమతము స్వీకరించిననాడు రాజ్యములో ఇంకెవ్వరు బౌద్ధ మతస్థులు కాకుందురు!

అటులనే యావత్తు లంకారాజ్యమున బౌద్ధమత ప్రచారము జరిగెను. నేడును లంకాద్వీపము బౌద్ధులకు పుణ్యక్షేత్రమే.

ఏమహావృక్షముక్రింద తపస్సు జేసి తాను కోరిన జ్ఞానమును గౌతముడుపొంది 'మహాత్మ గౌతమబుద్ధు'డాయెనో ఆ పూజ్య వృక్షమును 'భోధివృక్షము' అని పిలుతురు.

ఈ వృక్షము బౌద్ధులకు మహా పవిత్రమైనటువంటి పూజ్యనీయ వస్తువు. ఈ వృక్ష రాజమునుండియే ఒక కొమ్మను అతిజాగ్రత్తగా లంకకు తీసుకొనివెళ్లి నాటెను. ఆ 'దీక్షాకంకణదారి సంఘమిత్ర.'

ఆమె బోధించిన బౌద్ధమతమెటుల, ఆ లంకారాజ్యమందు బహుళ ప్రజాదరణము పొందెనో అటులనే ఆమె నాటిన భోధివృక్షపుకొమ్మకూడ విశాలవృక్షమై ఈ నాటికిని లంకా ప్రజలకు పూజ్యనీయ వస్తువుగా నిలచెను.

రాకుమారి సంఘమిత్రయొక్క సాహసము, ధర్మప్రేమ, త్యాగము, కార్యదీక్ష, సహజీవులనిన ఆమెకుగల ప్రేమ మొదలగు గుణములవల్ల ఇతిహాసకాలమునుండి నేటికిని ఆమె నామము అమరమై అనన్యసామాన్యమైన పదవిని పొందకలిగెను.

ఆ మహిళామణి భారతమాత ముద్దుబిడ్డ. స్త్రీలోక ఆదర్శజీవి (పురుషులకును) ఐన ఆ సంఘమిత్ర నిజముగా సంఘమిత్రయేగదా....

సంఘమిత్రవంటి సంఘమిత్రులకే నా రెండు వాక్యములు అర్పితము.

---

# మాతృ దేవత

కవయిత్రీ తిలక శ్రీమతి వసంతా దేవి

వింత కాంతులు మోముపై వెలుగు లీన
తోణకు లాడెడి భావాలు తొలకరించి
పరిమళము చిమ్ముచుండగా పరమహంస
ప్రోల భక్తిని నిలుచున్న బాల యెవరు;

ఇంత కాలమ్మునకు తల్లి, యెదుట బడితి
వనుచు పాదాల వ్రాలెడి భూప్తభక్త
చరణ కమలాలపై దేవి శిరము వాల్చి
కనుల నీరిడగా నేమి కారణమ్ము?

ఇహ పరమ్మైన్నన పతిగూర్చి యహరహమ్ము
విరిసి మురిసెడి హృదయాన వెల్లి విరియ
తెలిసి తెలియని తలపుల తీయదనపు
చెలిమి కలుములు తెలుపగా దలచెనేమొ!

దొరల కన్నీటి ధారలు దోసి లొగ్గి
దయను కాపాడ వలెను ఖిద్దాన నెనెడి
మిన్న బోయిన కళలతో నున్న మోము
చిరపరిచయమ్ము దేనినో చెప్పెనేమొ

కామినీ కాంచన నృర్శ కలల నైన
తాళజాలని యోగీంద్రు దయను గనగ
పరిణత మ్మైనభావాల పరిచరించు
దివ్యతమ దీక్ష కైకొని తీరునేమొ

యోగ నిష్ఠా గరిష్ఠుడై యున్న పతిని
సన్నిహిత మార్గవర్తిని సహచరించి
ఆర్యనారీత్వ మానసారాధ్య మైన
యాశయ మహోన్న తాగ్రంబు నందు నేమొ

# వెంగళప్ప వైద్యం

కుమారి దొండపాటి వసుంధరాదేవి

| | | |
|---|---|---|
| వెంగళప్ప | ... | జూదగాడు |
| సీతమ్మ | ... | వెంగళప్ప భార్య |
| శంకరయ్య | ... | వెంగళప్ప సేవకుడు |
| జానకిరామయ్య | ... | జమీాందారుగుమాస్తా |
| రాముడు | ... | జమీాందారు సేవకుడు |
| జమీాందారు | ... | |
| లీల | ... | జమీాందారు కుమార్తె |
| జ్యాలారావు | ... | జమీాందారు అల్లుడు |
| సీత | ... | జమీాందారుపరిచారిక |

(1 వ రంగము)

(వెంగళప్ప యింట్లో కుర్చీ మీాద కూర్చొని యుంటాడు)

వెంగళప్పు:—ఇదిగో — యీా యిల్లు, వాకిలీనావి. హిందూ ధర్మ శాస్త్రప్రకారము యీా సంసారానికి, నీకు నేను యజమానిని. నీవు నాకు ఎదురు చెప్ప కూడదు.

సీతమ్మ:—ఇంట్లో పెత్తనంనాది; బయటి పెత్తనం మీాది.

వెం:—ఊహూ — పిట్టకూతకువచ్చిందే! అధికారాలు, అజమాయిషీలూనా — ఆడంగుల రాజ్యము ఏర్పడేటట్లున్నదే!

సీ:—మీామురిపెములు, సకిలింపులు సహించుటకుగాదు మా నాన్న నన్నుమీాకిచ్చిచేసింది.

వెం:—ఆ చొప్పుదంటు వాదనే నాకు గిట్టదంటాను.

సీ:—మీా అసందర్భపు వాగుడు యింకమానండి

వెం:—ఇంతకూ నిన్ననవలసిన పనేముందీ! - నీకు నాకు ముడిపెట్టిన పెద్ద పీనుగలను అనాలి.

సీ:—పెండ్లిలో అర్థంగాని మంత్రాలు చదివాడే, ఆ పురోహితుడుగూడ... ...

వెం:—ఈ గుది బండను నా మెడకు తగిలించిన మా అమ్మను, నాన్నను ఏమనాలో తెలియడంలేదు.

సీ:—చచ్చి స్వర్గానున్నారా పెద్దలు — వారిననవాకండి; కండ్లు రెండూ దించుకపోతవి.

వెం:—ఏమిటీ రబస! - నీ వెధవవేషాలను శోభనం నాటి మొదటి రాత్రే కనిపెట్టాను.

సీ:-కనిపెట్టకేం — వెర్రివానికి వరహాలమూటలాగ దొరికానుమీాకు — ఏనాడో పెట్టి పుట్టారు. అర్థం, ప్రాణం, యావత్తూ పీల్చి పిప్పిచేశారు,

వెం:-ఏమిటాదబాయింపులే! — మీా వాళ్లిచ్చినది కాస్తా కూస్తా ఏ నాడో అయిపోయింది.

సీ:—అయిపోకేముందీ! మాయదారి పేకాటతో

తల్లోవి, మెళ్లోవి, చెంబు తపాలాలోసహా మీ మొహాన పెట్టుకున్నారు.

వెం:_ఉన్నవానితోనే గడుపుకోవాలిమరి!

సీ:-పందిరిపట్టెమంచముకూడ తాకట్టాయ!

వెం:_అదిలేదు కాబట్టే ఉదయం త్వరగా లేస్తున్నాము.

సీ:-వరాస్థి అంటూ ఒక గవ్వఅయినా లేదుకదా!

వెం:_అందుకనే మనకు దొంగలభయమనేది లేదు.

సీ:-ఉదయం లగాయతు సాయంకాలందాక మాయదారి పేకాటేనాయ!

వెం:_నయంకదూ! - అనవసరపు తగాదవలలో దిగకుండా —

సీ:_అయితే యిక మీబోటి వాళ్ళకు పిల్ల, బీరకాయ లెందుకూ!

వెం:_నీకేలా అనిపిస్తే అలా

సీ:_చంటివాడు చంకదిగడాయ!

వెం:- నేలమీద పడెయ్యి

సీ:_గుంట వెధవలు అన్నమో రామచంద్రాయని ఏడుస్తుంటేనా!

వెం:_బెత్తం చూపించు

సీ:_అయితే యింక యింతే నన్నమాట!

వెం:-మరేంపరవాలేదు.

సీ:_అయితే యికదారిన పడేమార్గం లేదన్నమాట!

వెం:_ఇదిగో దీనితోనే (బెత్తం చూపిస్తాడు)

సీ:-ఈ బెదిరింపులకేంలెండి!

వెం:_గాజులు జాగ్రత్త!

సీ:-ఇంకేముందీ — పేకాటదాముల ప్రతాపం!

వెం:_ కట్టి పెట్టు — పాకం ముదురుతున్నాదే.

సీ:-జూదగాళ్ళకు యింతకంటె మరేముందీ!

వెం:_ముందు నోర్ముయ్!

సీ:_సిగ్గు, లజ్జ లేకపోతేసరి జన్మకు.

వెం:_ఆ ... భడవా ... (కొట్టును)

సీ:-చచ్చాన్రోయ్!

వెం:-లజ్జవదిలిందా?

సీ:_చంపేస్తున్నాడ్రయ్యో!

వెం:_లజ్జట ... అభిమానమట... వీపుపేల్చేస్తా.

(శంకరయ్య ప్రవేశం)

శంకరయ్య:-వెంగళప్పా! పెండ్లాన్ని కొట్టినవాడు పట్టి ద్రాబఅని మన అయ్యావారు చెప్పలేదట్రా!

వెం:_ఏయ్! నా యిష్టం

సీ:-మేము కొట్టుకుంటాం, తిట్టుకుంటాం - మీరెవరు మధ్య?

వెం:-ఓరి పానకంలోపుడకా!

సీ:-అసలు నిన్నిక్కడికి ఎవరు రమ్మన్నారు?

శం:-అసలు మిమ్ములను ఎవరు కొట్టుకొని ఏడ్వమన్నారు?

వెం:_ఓరి కోతి పీనుగా! పిలవని పేరంటానికి నిన్నెవరు రమ్మన్నారు?

శం:-లేదు బాబూ! లేదు ... బుద్ధిగడ్డితిన్నది.

వెం:_ఇద్దరు పెద్దవాళ్లు కొట్టుకుంటుంటే మధ్య పిల్లకాకి వెధవ్వ నీకెందుకు! — వెళ్లు (మెడబట్టి గెంటును)

వెం:_ఎంతగ్రంధం జరిపావుసీతా! ... ఏదీ ...

సీ:_చాలులెండి... ఒళ్లంతా పులిసిపోయింది దెబ్బలకు

వెం:_ఏడిశావులే ... ఈ మాత్రం చిలిపికయ్యాలు లేకపోతే మనప్రణయ వృక్షం చిగిర్చేదెట్లా!

(2 వ రంగము)

సీ:_మావారి వ్యవహారం దినదినానికి సృతిమించి రాగాన పడుతున్నది. ఏదో విధంగా ఆయనలో మార్పు తేవాలి.

జానకిరామయ్య:_(ప్రవేశించి) ఈ వైద్యులకొరకని తిరుగలేక నాపని అవుతున్నది. లీలమ్మ జబ్బు కాదుగాని నా చావుకువచ్చింది.

రాముడు:_అమ్మోరి జబ్బేమిటో

జా:_గొప్పవారి జబ్బులు గొప్పవారికే తెలియాలి. ఆయమ్మ పైకి నక్కలాగుండి, మూగనోముపట్టి పైకి మాత్రం మాట్లాడదు. పై తిండీ, పానీయాలకు ఏమిలోటులేదు. (ఒక్కొక్కయింటి వైపు పారజూస్తూ పోతుంటాడు) ఎక్కడ చూచినా డాక్టరు బోర్డులే ... కాని మనలీల మృకు నయం చెయ్యగలది ఎవరాయని!

సీ:_(తనలో) వీళ్లెవళ్లో డాక్టరు కొరకు వెదకుతున్నట్లున్నది. (పెద్దగా) ఎవరయ్యామీరు! ఏవూరు

జా:_మాది వెలుపలపల్లి. మా జమీందారుగారి కుమార్తెకు నెలరోజులక్రిందట నోరుపడిపోయింది ఎవరైనా నయంచేయగల వైద్యులుంటే పిలుచుకొని వెళ్దామని వచ్చాము.

సీ:_అయితే యీప్రక్కతోటలోనే ఒక ఘన వైద్యుడున్నాడు. ఆయనకు అన్నిరకాల వైద్యమునందు అనుభవమున్నది.

జా:_అలాగా!

సీ:_నిన్న కాక మొన్న మూడంతస్తుల మేడమీదనుండి పడి మూర్ఛపోయిన మా మేనత్త కొడుక్కి ఒక్క సూది పోటు యిచ్చేసరికి మామూలు స్థితికి వచ్చాడు.

జా:_ఎలాగూ ... ...!

(సశేషము)

---

మేజస్ట్రేటు పదవినుండి విరమించుకొని క్రైస్తవ పూజారిగా మొట్టమొదటి వివాహమును చేయిస్తూ, వధువునుచూచి "నీవీ యువకుని ఆత్మసమ్మతితో జీవిత భాగస్వామిగా స్వీకరించదలచావా?" అని అడిగాడు.

"అవును"

వరునిచూచి "అయితే నీవో మరి! - ప్రతి వాదిగా ఏమిచెప్పదలచుకున్నావు"

'నారపీచు'

---

## బాల పక్షవాత వ్యాధి నిరోధానికి మందు

ప్రముఖ సోవియట్ శాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ ఎమ్. ఛుమకోవ్ ఆధ్వర్యాన, బాలపక్షవాత వ్యాధినిగూర్చి పరిశోధనసాగించిన మాస్కోసంస్థ, యీవ్యాధి నిరోధానికి పిల్లలకు యింజక్షను యివ్వడానికి ఒకమందు (వేక్సిన్) కనిపెట్టి, ఎక్కువగా దానిని ఉత్పత్తి చేయడం ప్రారంభించింది. బాల పక్షవాత వ్యాధికి మూలమైన క్రిములను (వైరస్‌లు) చంపి, వాటికిగల అంటువ్యాధి లక్షణాలను తొలగించి వాటితో చేయబడిందీ వేక్సీను. ఈ మందు పరీక్షించబడి దీనివల్ల ఎలాంటి హానీకలుగదనీ, యీవ్యాధికి మంచి గుణమిస్తుందనీ గుర్తించబడింది.

# నా పలుకులు

శ్రీమతి M. లక్ష్మీదేవి

వెలువడ్డవి నా పలుకులు నోటినుండి
గాలిదేవుడు సర్వత్ర ఊది వచ్చాడు

విన్నవారందరు వింతచూపులు చూశారు
మిన్నక మెలగినారు దోషమున్నవారు
పన్నిన వలలన్ని పాడయ్యెనటంచు
సన్నని. నిట్టూర్పు విడిచారు సన్మార్గ విరోధులు॥

వ్రక్కలై పోయిన హృదయ మందు
చెక్కబడినవి శిలాతల మందువలె
నొక్క బడ్డ వారి జీవిత సరణి
చక్క బడినవి సంతోష మొందు రీతి॥

వినిపించినవి నాపలుకులు విను వీధియందు
విలసిల్లినవి నాపలుకులు విస్తారముగ
కలసి వచ్చినవి నాపలుకులు కలిమి లేములతోడ
అలసి వచ్చినవారికి స్వాంతన మిచ్చురీతి॥

స్వాతంత్ర దేవి స్వాగతించింది.
ఉషాదేవి ఉద్బోధించింది
రేరాణి తారలతో జతగూర్చింది.
జాబిల్లి తన జ్యోత్స్నతో బాటు జారవిడిచింది

ప్రకృతి పుష్పాంజలి సమర్పించింది
కుసుమ కన్యక మధువును ద్రావనిచ్చె
శుకపికములు సుశ్రావ్యగీతముల వినిపించె
కుటజ మయూరములు నాట్యములు సల్పె

పర్వత శ్రేణులు గంభీరముగ తలలూపె
పారావారములు ప్రీతితో నుప్పొంగె
వరుణధారలు నాకరుణకు ఆమోదించె
ధరణి మాత నా ధైర్యంబునకు మెచ్చుకొనియె

విశ్వమెల్ల నా పలుకులను విశ్వసించె
కమ్మని నా పలుకులకు సమ్మతించె
ఇమ్మహిని మనులెల్ల నమ్మోయన
చిన్న మానవుడేమి చేసె?

---

## "దీర్ఘ జీవితానికి కారణం శాఖాహారమేమో"

## 154 యేళ్ల వృద్ధురాలి కధనం

మాస్కోనివాసి నిల్యుబోవ్ పుజక్ వయస్సు యిప్పుడు 154 సంవత్సరాలు. [illegible] జన్మించింది. ఆమెకు మంచి జ్ఞాపకశక్తివుంది, శతాబ్దంకిత్రం జరిగిన విషయాలు నిన్న మొన్న జరిగినట్లుగా చెబుతుంది. రష్యన్ మహాకవి పుష్కిన్ చనిపోయినప్పటికి ఆమె వయస్సు 34 యేళ్లు. ఆమె పుష్కిన్, నెక్రసోవ్, ఛెకోవ్, లియోటాల్ స్టాయ్‌లను స్వయంగా చూసింది.

"నాకుటుంబంలో నూరేళ్లకు పైగా జీవించనది నేనొక్కర్తినేకాదు. నా సోదరులలో ఒకరు 118 యేళ్లు, యింకొకరు 122 ఏళ్లు, నా సోదరి 112 యేళ్లు వయసుకలిగి వున్నారు." అని ఆమె తెలిపింది.

దీర్ఘ జీవన విషయంగురించి పరిశోధిస్తున్న ప్రముఖశాస్త్రజ్ఞులు తరచు ఆమెవద్దకు వెళ్ళి సంగతులు తెలుసుకుంటూవుంటారు. వారి ప్రశ్నలకు జవాబిస్తూ ఆమె యిలా చెప్పింది. "నా దీర్ఘ జీవనానికి కారణం నా ఆహారమో మరేదో నాకు తెలియదు కాని నేనెప్పుడూ మాంసంతినలేదు. అల్లికపని అంటే నాకు గొప్పసరదా, ఈనాటివరకు నాపనులన్నింటినీ నేనే చేసుకోగలుగుతున్నాను. బజారుకెళ్లి స్వయంగా సరుకులు కొనుక్కుంటూవుంటాను. నేను రోజూ రాత్రి 12 గంటల వేళ నిద్రపోయి ఉదయం ఆరుగంటలకు లేస్తుంటాను."




# రంగడు — రాకుమారి

శ్రీమతి కొండూరి రామసీతమ్మ

—:o:—

రంగడు అప్పుడే మిలిటరీనుంచి విడుదలయ్యాడు. స్వగ్రామానికి బయలుదేరాడు. రైలు బస్సు ప్రయాణం అయింది. ఇంకొక పదిమైళ్లు నడిస్తేనే గాని స్వగ్రామం చేరుకోడు. ఇంటికిపోతున్నాననెడి ఉత్సాహంతో పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ "రైటు, లెఫ్టు" అనుకుంటూ రోడ్డున పోతున్నాడు. భుజాన పెద్దమూట, కాకీగుడ్డలు, పెద్దబూటూ అన్నీ చూస్తుంటే యుద్ధరంగానికి పోతున్నాడా అని పిస్తుంది చూచేవాళ్లకు. కొంతదూరం వచ్చేసరికి రంగడికి ఒక ముసలమ్మ ఎదురైంది. ఆ అవ్వ చాలా అందవిహీనంగావుంది చూడటానికి. కానీ మంత్ర విద్యలో అందవేసిన చెయ్యి.

రంగడినిచూచి "నమస్కారమండీ, సిపాయిగారు. ఆహా ఎంత అందంగా వుందండీ మీ కత్తి, మీ బెల్టు, బూట్లూ ఎలా మెరుస్తున్నాయో! భుజాన సంచీ గూడా చాలా పెద్దదిగావుందే. చూడంగా మిలిటరీలో పెద్ద వుద్యోగస్థుడవని తోస్తోంది. నిన్ను చూస్తే నాకెందుకో సహాయం చెయ్యాలని సంకల్పం గలిగింది. నీకు ఆర్థికంగా సహాయపడతా. ఎందుకంటే ప్రపంచంలో డబ్బువుంటే, చెయ్యలేనిపని వుండదు. డబ్బుతో ఏమయినా సాధించవచ్చు. కోరుకో ఎంత ధనం కావాలో" అంది.

"దానికేం తల్లీ, నీ దయ వుండాలిగాని, తమరి చిత్తంవచ్చినంత దయచేయించండి" అన్నాడు రంగడు చేతులు నలుపుతూ.

"అలా అయితే నేను చెప్పినట్లుచెయ్యి" అని రోడ్డు ప్రక్కనవున్న ఒక పెద్ద చెట్టును చూపిస్తూ "ఆ చెట్టునుచూడు, దాని బోదె అంతా బోలుగా ఖాళీగా వుంటుంది. ముందు చెట్టుపైకి ఎక్కు. అక్కడ నీకు ఒక తొర్ర కనిపిస్తుంది. ఆ తొర్ర లోంచి నెమ్మదిగా మొదలువరకూ ప్రాకిరా. అచ్చట నీకు మెట్లు కనబడుతై, ఆ మెట్లమీదనుంచి క్రిందకు దిగివెళ్లు, మళ్లా నిన్ను చెట్టుపైకి లాగేదానికి నీ నడుముకు ఒక పెద్ద త్రాడు కడతా, నీ పని అయిన తరువాత సైగచెయ్యి, నిన్ను పైకి లాగుతా" అంది ఆ ముసలిది.

"సరే అలానే చేస్తాగానీ మెట్లుదిగి క్రిందకుపోయి ఏంచెయ్యమంటా?"

"ఏంచేసేదేమిటి, డబ్బు పోగుచేసుకో, నీవు మెట్లుదిగి క్రిందకు వెళ్లేసరికి ఒక పెద్దహాలు కనిపిస్తుంది, ఆ హాలంతా బాగా వెలుతురుగానే వుంటుంది. అక్కడ మూడు వందల ఆముదం దీపాలు వెలుగుతుంటయి. ఆ హాలులో మూడు పెద్ద పెద్ద

గదులువున్నాయి. వాటి తాళంచెవులు ఆ గది తలుపుకే వ్రేలాడబడివుంటయి. మొదటిగదితలుపు తెరచి లోనికిపో, అక్కడ మధ్యగా ఒక పెట్టె వుంటుంది. ఆ పెట్టెమీద ఒక పెద్ద కుక్క పడుకుని వుంటుంది. దాని కళ్లు నారింజకాయలంత వుంటయి. అది నిన్ను చూడంగానే పడుకునే పెద్ద అరుపు అరుస్తుంది. దానికి భయపడమాక. నీకు ఒక నీలంజేబు రుమాలు యిస్తా, దానిని నేలమీదపరిచి ఆ కుక్కను చేత్తో పట్టుకుని తీసుకునివచ్చి దానిమీద పడుకోబెట్టు, ఆ కుక్క నీలంగుడ్డ చూచేసరికి నోరుమూసుకుని పిల్లిలాగావచ్చి పడుకుంటుంది. తరువాత ఆ పెట్టెను తెరు. దానిలో రాగి నాణేలు వుంటయి, నీకు కావాల్సినన్ని తీసుకో.

"వెండి నాణేలు కావాలంటే రెండవగదిలోనికి వెళ్లు. ఆ గదిలోకూడా ఒక పెట్టె వుంటుంది. దాని మీదగూడా ఒక పెద్ద కుక్క వుంటుంది. దాని కళ్లు దబ్బకాయలంత వుంటయి, అదిగూడా అరుస్తుంది, కానీ భయపడకు, ముందు లాగానే నీలంగుడ్డనుపరిచి దానిని తీసుకువచ్చి ఆ గుడ్డమీదపడుకోబెట్టి పెట్టె తెరిచి నీకు కావాల్సినన్ని వెండి నాణేలు తీసుకో.

"నీకు వెండి నాణేలుగూడా అక్కరలేదనుకుంటే మూడవగదిలోనికివెళ్లు. అక్కడ బంగారం నాణేలు వుంటాయి, ఆ గదిలోగూడా పెట్టె వుంటుంది. దాని మీదగూడా ఒక కుక్క వుంటుంది, ఇది ముందు రెండు కుక్కలకంటే చాలా భయంకరంగావుంటుంది. దాని కళ్లు తాటికాయలంత వుంటాయి. ముందు లాగానే గుడ్డనుపరిచి దానిమీద కుక్కను పడుకోబెట్టి నీకు కావాల్సినన్ని బంగారు నాణేలుతీసుకో."

"ఓ, అలానేచేస్తా, సరేగానీ నీవు నాయందు యింత దయతో ఈ విషయాలు చెప్పావు. మరినేను ప్రతిఫలంగా నీకేమియ్యాలి? ఆ ధనంలో వాటా కావాలా? ఎంతవాటా కావాలేం?" అన్నాడు రంగడు.

"భాగమా? ఛా. తప్పు. ఒకరికిసహాయంచేసి పతిఫలంపొందటంకేవలం ద్రోహంక్రిందజమే. అసలయినా నాకెందుకుధనం. నేను కాటికికాళ్లు చాచుకుని కూర్చున్నా. కానీ ఒక్క చిన్నపనిమాత్రం చేసిపెట్టు ఆహాలు. మధ్యన ఒక చిన్న పాతపెట్టె పడి వుంటుంది. అదితెచ్చిపెట్టు. ముందు మా అమ్మలోనికి వెళ్ళినప్పుడు ఆ పెట్టెను మరచిపోయివచ్చింది. అది మాత్రం తెచ్చిపెట్టు చాలు."

"ఓ. అదెంతభాగ్యం, అలానేతెస్తాలే, ఆ జేబుగుడ్డయివ్వు," అని జేబుగుడ్డ తీసుకున్నాడు రంగడు. జేబుగుడ్డతోబాటు పెద్ద చేంతాడునుగూడా యిచ్చింది ఆ ముసలమ్మ. త్రాడును బాగా బిగించి నడుముకు కట్టుకుని రంగడు చెట్టెక్కాడు. చెట్టుమీద ఒక కొమ్మచివర తొర్ర కనిపించింది. నెమ్మదిగా ప్రాకుతూ తొర్రలోనికిదిగాడు. అలా ప్రాకుతూ క్రిందకు దిగేసరికి కొన్ని మెట్లు కనిపించినయి. ఆ తొర్ర అంతా చీకటిగావుంది. మెట్లు క్రిందకు పోనుపోనూ బాగా విశాలంగావున్నాయి. క్రింద బాగా వెలుతురుగానేవుంది.

మెట్లు ఒక హాలులోనికి వున్నాయి. హాలులోనికిపోయి చూడగా అక్కడ ఆ మంత్రకత్తె చెప్పినట్లు మూడువందల ఆముదం దీపాలు వెలుగుతున్నాయి. ఆ హాలులో మూడు గదులు కనిపించినయి. నెమ్మదిగా మొదటిగదివద్దకువెళ్ళి తాళంతీసి తలుపు త్రోసుకునిలోనికి వెళ్ళాడు రంగడు. ఆ గది మధ్య పెద్ద కొయ్యపెట్టె దానిమీద ఒక కుక్క కనిపించింది. ఆ కుక్క రంగడిని చూడంగానే 'బొయ్యో' మని పెద్ద అరుపు అరిచింది. "ఓ, ఆ ముసలిది చెప్పింది నిజమే" అనుకున్నాడు రంగడు. నెమ్మదిగా అవ్వ యిచ్చిన నీలంజేబుగుడ్డ క్రిందపరచాడు. ఆ గుడ్డను చూచేసరికి ఆ కుక్క పిల్లిలాగా తోక ఆడిస్తూ పడుకుంది. రంగడు నెమ్మదిగా ఆ కుక్కను పట్టుకుని తీసుకొచ్చి గుడ్డమీద పడుకోబెట్టాడు. నెమ్మదిగా పెట్టెతెరచిచూశాడు. అందులో అన్నీ రాగి నాణేలు వున్నాయి. వాటిని చూచేసరికి రంగడికి ఆశ్చర్యంకలిగింది.

(సశేషము)

# శ్రీ సాయిభక్తుల అనుభవములు



మద్రాసు — సైదాపేట వాస్తవ్యుడు శ్రీ పెరుమాళ్ యిలా వివరించారు :

ఆరు సంవత్సరముల క్రిందట నా కుమారుడు క్లాసులో తక్కువ మార్కులువచ్చినే నేమంటానో అని పారిపోయెను. అతని ఉనికి గురించి, క్షేమసమాచారమునుగురించి తెలిసికొనుటకు విచారించి, వెదకి చాలిపోయాను. ఈ సంఘటన ఫలితముగా మాలో చాలా ఆదుర్దాకలిగి, నా భార్య ఆరోగ్యము క్షీణించి మూర్ఛవ్యాధికి గురియయ్యెను. కొన్ని రోజులు భుజించుట మానివేసితిమి. నేను దుఃఖముతో అధికారధర్మములను నిర్వహించలేకపోయితిని. చివరకు నిరాశతో భగవంతునకాత్మార్పణముచేసి నా కుమారుడు బ్రతికియున్నచో క్షేమముగా తిరిగిరాగలందులకు ప్రార్థింపతొడగితిని. నాకు జాబుగాని, ఏ సమాచారముగాని అతనినుండి లేకుండెను. పైగా ప్రతివారు నా కుమారుడు పరారైపోయినందుకు హేళనచేయసాగిరి. అయినా భగవంతునిపట్ల విశ్వాసముంచి ప్రార్థనచేయుచుంటిని.

ఒకనాడు నేను ఒక స్నేహితునితో నా కుమారుడు పరారైపోయి, జాడతెలియలేదని చెప్పుచుండగా ఒక విద్యార్థి దానిని విని స్వామికేశవయ్యజీని ఆశ్రయించినచో శ్రీ సాయిబాబా అనుగ్రహముతో సహాయము లభించగలదని చెప్పెను. అతడింకా స్వామిజీ శ్రీ సాయిబాబా భక్తుడని చెప్పెను. నాకింతకుముందు శ్రీ సాయిబాబాను గురించి తెలిసియుండియు, ఆయన పటము నా యింట యుండియు నా కాయనయందు భక్తి విశ్వాసములు ఏర్పడలేదు. విద్యార్థి చెప్పిన మాటలు నా మనసులో నాటుకొనిపోయి 1957 ఏప్రెలు నెలలో ఒకనాడు స్వామీజీని దర్శించి నా మానసిక బాధను వివరించితిని. ఎప్పటియట్లు ఆయన విబూది కొంచము నోట్లోవేసి, కొంచము ముఖముపై బొట్టుగాపెట్టి నా కుమారుడు బ్రతికియున్నాడనియు, సుఖముగా నున్నాడనియు చెప్పి 43 రోజులలో నా కుమారుడు తిరిగి రాగలడని చెప్పెను.

స్వామిజి మాటలు నా కుమారుడు సజీవుడుగా నున్నాడను నమ్మకము కలిగించినవి. ఆ మాటలు అప్పుడు నాకు అమృతప్రాయములైనవి. రెండు వారములనంతరము నా కుమారుని దగ్గరనుండి 6 సంవత్సరముల తరువాత జాబు వచ్చినది. ఆ జాబులో తన క్షేమసమాచారములతోబాటు మే నెలాఖరున తాను యింటికివచ్చెదనని వ్రాసెను. వ్రాసిన ప్రకారము వచ్చి కుటుంబముతో చేరెను. ఇది స్వామిజి చెప్పిన 43 రోజుల గడువులో 35-వ రోజున జరిగెను.

నా కుమారుడు యిల్లుచేరగానే స్వామీకేశవయ్యజీని దర్శించినప్పుడు "అన్ని పరిస్థితులు చక్కబడగలవ"ని చెప్పెను. అంతకు మూడు రోజులకు ముందుగానే నా కుమారునకు ఉద్యోగము లభించియుండుటచే వారి మాటలు నన్నాశ్చర్యపరచినవి.

ఈ సందర్భమున శ్రీ సాయిబాబాకు తన భక్తులపట్లగల ప్రేమానురాగాలు గుర్తించతగినవి. 'మీరు నన్ను శరణువేడినచో రక్షణ తప్పక లభించగలదు' అను శ్రీ సాయిబాబా వాక్యములు సార్థకమైనవి. స్వామికేశవయ్యజీద్వారా బాబా పీడిత మానవుల కష్టములను నివారించి రక్షణ నిచ్చుచున్నాడనునది అతిశయోక్తి కానేరదు. గురువారమునాడు శ్రీసాయి సన్నిధిన ప్రేమానురాగములతో స్వామికేశవయ్యజీ భక్తులను స్వీకరించుచుండుట ఉత్సాహ తన్మయత్వముల కలుగజేయుచుండును.

♦ ♦ ♦

దంపతులిద్దరు ప్రతి గురువారం సాయి నిలయమునకు శ్రీ బాబా ఆరాధనలో పాల్గొనుటకు వచ్చెడి

వారు. వారికి ఒక్కతె ఆడపిల్ల. తర్వాత సంతానములేదనే కొరత వారిని బాధిస్తుండేది. ఒకప్పుడు స్వామి కేశవయ్యాజీతో తమ కొరతను మొరబెట్టుకొనగా పుట్టి పెరుగుచున్న బిడ్డకు 11 సంవత్సరముల వయస్సప్పుడు సంతానమున కవకాశము కలుగవచ్చుననియు, అప్పుడు సంతానము కలుగకపోయినచో సంతానమే కలుగదని చెప్పిరట. అట్లే వారి అమ్మాయికి 11 ఏళ్లు వయస్సురాగానే తల్లి గర్భవతియై సంతానము కలిగెను.

◆ ◆ ◆

ఒక భక్తుని భార్యకు 1955 లో జబ్బుచేసెను. వైద్యవసతులకు, చికిత్సకు విస్తారంగా ఆమె భర్త డబ్బు వెచ్చించాడు; కాని గుణమేమి లేకపోయెను. అప్పుడా భక్తుడు షెణాయ్‌నగర్ లోని శ్రీ సాయి సన్నిధికి ప్రతి గురువారం వెళ్ళి విభూది, ప్రసాదములను స్వామి కేశవయ్యాజీదయతో పొందనారంభించెను. ఆశ్చర్యకరంగా అప్పటినుండి భార్య ఆరోగ్యముతో కనుపించసాగెను. చేయించుచున్న చికిత్స ఫలప్రదమై యిప్పుడామెకు సంపూర్ణారోగ్యము చేకూరెను.

◆ ◆ ◆

గుంటూరుజిల్లాయందలి క్రోసూరు బోర్డు హైస్కూలు హెడ్‌మాస్టరు శ్రీ యం. మాధవరావు తనకు శ్రీ సాయిబాబాపట్లగల అచంచల భక్తి విశ్వాసముతే తమ జీవయాత్రను సుగమంచేస్తున్న వనియు; శ్రీ బాబా కరుణా కటాక్షములు తన బిడ్డలుపోయి అల్లాడుచున్నప్పుడు, భార్యకు అనారోగ్యము సంభవించినపుడు రక్షించి కాపాడిన వనియు, మద్రాసులో నొకప్పుడు చైనాబజారులో తన కుమార్తె తప్పిపోయి దైవీకంగా ఒక యువకుని సహాయంతో వెంటనే దొరకడం తనపట్ల శ్రీ సాయి బాబాకుగల ప్రేమానురాగాలే కారణమని వివరించుచున్నారు.

శ్రీ సాయిబాబా కరుణా కటాక్షములను నిర్విరామంగా సేవాసక్తితో పంచిపెడ్తూ పీడితమానవ కోటి ఉద్ధరణే లక్ష్యంగాగల స్వామి కేశవయ్యాజీ కలకాలమువర్ధిల్లి ప్రజాహితమును, మానవశ్రేయస్సును ప్రోత్సహించునట్లుగా భగవత్స్వరూపి శ్రీ బాబా అనుగ్రహించుగాక ! అనునది భక్తుల ప్రార్థన.

——X——

(447 పేజి తరువాయి)

అ భి నం ద న లు

తన చలనచిత్ర వజ్రోత్సవ సందర్భమున శ్రీ అక్కినేని నాగేశ్వరరావు బీద విద్యార్థులకు ఉన్నత విద్యావసతులకుగాను ఆంధ్ర యూనివర్సిటీకి 25 వేల రూపాయలనిధి నిచ్చినందులకు అభినందనీయులు. ఈ సందర్భమున వారి ఔదార్యం మద్రాసులోని తెలుగులో విద్యా వసతులను పయితము మెరుగుపరచుటకు వినియోగపడిన ప్రశంసనీయము కాగలదు.

ముఖ్యంగా ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాలు విడిపోయిన తరువాత మద్రాసులో తెలుగులో విద్యాబోధనా సౌకర్యముల నపేక్షించే బాల బాలికలయొక్క, తెలుగులో విద్యగరపే విద్యాలయములయొక్క స్థితి క్లిష్టమైనది.

మద్రాసులోని తెలుగుస్కూళ్లు కొన్ని నివాసవసతి లేకయున్నవి. మరి కొన్నిటి పురోభివృద్ధి మందగించినది. మరికొన్నిటి నిర్వహణ ఆర్థికస్థిమితములేక తృప్తికరముగాలేదు. ఈ పరిస్థితులను పారజూచి శ్రీ నాగేశ్వరరావుబోటి వదాన్యులు సోదరాంధ్ర బాల బాలికల విద్యావసతులపట్ల ఆసక్తితో తెలుగు పాఠశాలలకు తగు సహాయం చేయడము సముచితమనిపించుకుంటుంది.

ముఖ్యంగా మద్రాసు చలనచిత్ర రంగంలో పుష్కలంగా ఆర్జించిన, ఆర్జించుచున్న శ్రీ నాగేశ్వరరావు బోటి తెలుగువారు మద్రాసులోని బాలబాలికలకు మాతృభాషలో విద్యావసతులకు తోడ్పడడములోని సార్థక్యము గుర్తించెదరుగాక !

# శ్రీ అక్కినేని నాగేశ్వరరావు

## చలనచిత్ర వజ్రోత్సవము

మద్రాసులో జూలై నెల 28-వ తేదిన శ్రీ నాగేశ్వరరావు చలనచిత్ర వజ్రోత్సవము వైభవోపేతంగా పలువురు పెద్దల ఆశీస్సులతో, అశేషకళాభిమానుల కళాకారుల మధ్య జరిగింది.

విజయావారి సహాయ సహకారములతో జరిగిన ఏర్పాట్లు యీ సందర్భమున 'మాయాబజార్'గా రూపొందినవని చెప్పుటలో అతిశయోక్తిలేదు.

ఈ వజ్రోత్సవము అనేక విధాల విశిష్టమైనది. తాను 60 తమిళ తెలుగు చిత్రాలలో నటించిన సందర్భమును అవకాశముగా తీసికొని తనకు చలనచిత్ర రంగంలో తోడ్పడిన చలనచిత్ర నిర్మాతలను సన్మానించడం, కళాకారుడైనా విద్యయొక్క ఆవశ్యకత ఎట్టిదో గుర్తించి, తాను సామాన్య కుటుంబమునుండి వృద్ధిలోనికివచ్చినవాడగుటచే తనకు ఉన్నత విద్యాభ్యాసమున కవకాశములేకపోవుటచే, తనవలె విద్యాభ్యాసమునకు ఆర్థికవసతిలేక నిస్పృహచెందుచున్న బీదలకు విద్యావసతికిగాను ఆంధ్రాయూనివర్సిటీకి 25 వేల రూపాయలనిధిని యివ్వడం పేర్కొనతగినది.

ఆంధ్రయూనివర్సిటీ వైస్ చాన్సలర్ డా॥ వి. యస్. కృష్ణా చెప్పినట్లు శ్రీ నాగేశ్వరరావు నిర్మాతలను సన్మానించుటలో విశేషము ఏమిలేదు. కారణమేమంటే చలనచిత్ర రంగంలో తన చిత్ర దిగ్విజయానికి ఒక నటుడు కారణమైతే అతనిని నిర్మాత సన్మానించడం, తనపట్ల ఆదరాభిమానములతో నిర్మాత ప్రోత్సహించి తన పురోభివృద్ధికి తోడ్పడినందుకు నటుడు నిర్మాతను సన్మానించడం పరస్పర సద్భావమును తెలియజేయునవేకాని ప్రత్యేకతఏమీలేదు. కాని లలితకళలకు, విద్యా రంగానికి సన్నిహిత సంబంధమును శ్రీ నాగేశ్వరరావు బీద విద్యార్థులకు విద్యా వసతులకుగాను విరాళమిచ్చిన 25 వేల రూపాయలనిధి ఏర్పరచడం ప్రత్యేక విశిష్టత.

అధ్యక్షత వహించిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ యన్. సంజీవరెడ్డి, నిర్మాతలకు షీల్డులను బహూకరించిన మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కే. కామరాజ్ నాడారు ఆంధ్ర మద్రాసు రాష్ట్రాల సమరస సద్భావములకు చలనచిత్ర కళ దోహదమైనదని యీ వజ్రోత్సవము నిరూపించుచున్నదనియు, శ్రీ నాగేశ్వరరావు మరింత నటనానైపుణ్యంతో మరింత ప్రజాదరాభిమానములకు పాత్రుడు కావాలని ఆశీర్వదించారు.

ఆంధ్ర యూనివర్సిటీకి రు. 25000/- నిధిగా నివ్వడం యావత్ప్రజానీకమునకు సంతోషమే. కాని అవసరాన్ని గుర్తించి, ప్రజోపయోగ నిమిత్తం ఎక్కడ ఎట్టి విరాళమిచ్చినా సార్థకమే కాగలదు.

శ్రీ నాగేశ్వరరావుతో బాటు యితరనటీనటులు సయితము ఆంధ్ర ప్రాంతము విడిపోయిన తరువాత మరింతగా మద్రాసులోని తెలుగు బాల బాలికలకు మాతృభాషలో విద్యావసతులు నీరసించడమును గుర్తించవలసియున్నది. తాము తెలుగువారై, తమ ఆర్జన మద్రాసులోనై, తెలుగు బాలబాలికల విద్యావసతులకని ఏర్పడిన విద్యాలయముల పురోభివృద్ధికి కొంతకాకపోయినా కొంత సహాయపడుట విజ్ఞత అనిపించుకుంటుంది.

ఉత్సవసభ ప్రార్థనానంతరము శ్రీ చిత్తూరు నాగయ్యగారి స్వాగతముతో ప్రారంభమయింది. ఆంధ్రప్రదేశ్, మద్రాసు ముఖ్యమంత్రులు, మద్రాసు హైకోర్టు ప్రధానన్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారు ప్రభృతులు చలనచిత్రరంగంలో శ్రీ నాగేశ్వరరావు గడించిన ఖ్యాతిని శ్లాఘించుచు ఆశీర్వదించిరి.

దేశనలుమూలలనుండి వచ్చిన సందేశాలను శ్రీ యన్. టి. రామారావు చదివారు.

విందు అనంతరము శ్రీ నాగేశ్వరరావు నటించిన 60 చిత్రాలలోని కొన్ని భాగములు వజ్రోత్సవ చిత్రమాలగా ప్రదర్శించబడినది. ఈ చిత్రమాల శ్రీ నాగేశ్వరరావు యొక్క క్రమబద్ధమైన పురోభివృద్ధిని సూచిస్తున్నది.

శ్రీ నాగేశ్వరరావుకు భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యములనిచ్చి ప్రజాహితాన్ని మరింతగా ప్రోత్సహించునట్లు చేయాలని మా ఆశ.

# స్వీకారము



ధ్రువవిజయము:- (ఎనిమిది అంకముల నాటకము) కర్త : శ్రీమాన్ వంగీపురం, కృష్ణమాచార్యులు విద్వాన్‌గారు, క్రౌనుసైజున 150 పుటలు, వెల రు. 3-0-0. వలయువారు 50, జనరల్ ముత్తయ్య మొదలివీధి, సాహుకార్పేట — మదరాసు. 1 అని వ్రాయవలెను.

భక్తిరసప్రధానమగు ఈ నాటకమును ప్రాచీన రూపకలక్షణవేత్తల మతానుసారముగ, స్వయముగా— నటకులు గాయకులయిన ఈ గ్రంథకర్తగారు దిద్ది తీర్చి, రసికజన హృదయాహ్లాదముగ రచించుటెంతయు కొనియాడదగినది. నానాటికి నాస్తికతవంకకు మొగ్గుచూపుచున్న యీనాటి భారత ప్రజకు తత్రాపి ఆంధ్రప్రజకు మరల ఆస్తికతా ప్రభావము వెలుగుచూపుట కిట్టి రచనము లెంతేని ఉపకారకములు. అందును కళాశాలలో ఉపన్యాసకులుగ పనిచేయుచున్న శ్రీ ఆచార్యులవారు నేటి యువకవిద్యార్థుల మనస్తత్వము పూర్తిగ ఆకళించిన వారగుటచే, వారికి రుచించు శైలిలో కడుంగడు రమ్యముగ ఈ రూపకమును నడిపినందున ఇది కళాశాలలలో పాఠ్యముగ ఏర్పడదగు యోగ్యతనుగూడ సంతరించుకొన్నది. మఱి యిట్టి గ్రంథములు విశ్వవిద్యాలయ పాఠ్యనిర్ణాయకసంఘ దృష్టిని ఆకర్షించుకొన్నప్పుడే ప్రాచీన భారత జాతీయతాస్థితి కొకింత ప్రాణమిచ్చినట్లగును.

నాటకము రూపుదాల్చునపుడు ఏయితివృత్తమయినా, తదనుగుణములగు కొన్ని మార్పులకులోగాకతప్పదు. అట్లిందు చేయఁబడిన మార్పులను కూర్పులనుగూడ శ్రీ ఆచార్యులవారు తమ 'గ్రంథపరిచయము'లో సూచించిరి.

'భక్తి' ఒకరసముగ ప్రాచీనులంగీకరింపలేదు; కాని 'వీర'మును దీసికొన్నచో అందలి పలుతెగల (దాన వీర సత్యవీరాదులను 'వీరము'లలో భక్తియుఁజేరఁదగినదే.) ఇందు తక్కిన రసములంగములుగ అటనట ప్రయోగింపఁబడినవి. ఉత్తానపాదుఁ డెంత దక్షిణనాయకుఁడయినను, బహుభార్యాత్వము వలని కుటుంబకల్లోలముల కగ్గము గాకపోలేదు. శ్రీకృష్ణుఁడయిన తప్పించుకొనఁగల్గెనా ? ఇంతకు సామాన్యులయినను, చక్రవర్తులయినను ఇట్టివి తప్పనిసరిగ తటస్థించుచునే యుండును. ఇట సురుచీదేవి వ్యూహము అసూయా పూరితమయినను, నారదుల దోహదముచే అది ఆవంశమునకు ముఖ్యముగ ధ్రువునకు మేలునే చేకూర్పఁగలిగినది. కాని ఇట్టి ఘట్టములు మనపురాణ గాథలలో చాల అరుదు.

నాటకకర్తయొక్క రూపకనిర్మాణనైపుణి ప్రతియంకమున గోచరించుచున్నది. ఇందలి పద్యగద్యములన్నియు రసౌచితి ననుసరించి మనోజ్ఞములగు శబ్దజాలములతో జాలువాఱుచున్నవి. నీచపాత్రల వ్యావహారిక భాషాప్రయోగసిద్ధాంతము ఇందు చక్కగ పాటింపబడినది. కథావస్తువు సర్వవిధముల సుసంపన్నము. గ్రంథమున నెక్కడనో తప్ప అచ్చుతప్పు లేమాత్రము దొరలకుండుట పేర్కొనదగిన విశేషము. తొలుత నున్న "గ్రంథపరిచయము"న ఇతివృత్తాదికములను గూర్చిన సమగ్రచర్చయును, కడపటి "అనుబంధము"న నాటకలక్షణములఁగూర్చిన పలువిషయా విష్కరణమును పాఠకులు సులభముగ ఈ నాటకముం జదివి విషయములెఱుంగఁ దోడ్పడుచున్నవి. దీనిం గూర్చి పలువురు ప్రముఖులు లోకసభాధ్యక్షులగు శ్రీ అనంతశయనమయ్యంగారువారు, శ్రీ రాళ్లపల్లివారు, అభినవతిక్కన శ్రీ తుమ్మలవారు సదభిప్రాయము లొసంగియున్నారు.

ఆర్టుపేపరు అట్టపయి ముద్రింపబడిన ముఖచిత్రము త్రివర్ణయుతమయి, అందములు చిందించుచున్నది. మొత్తముమీఁద ఇది తెలుగువారెల్ల ముఖ్యముగ ఆదరింపదగిన గ్రంథరాజము.

'కౌశిక'

---

# సంపాదకీయములు

## స్త్రీలకు విద్యావసరము

ప్రతి స్త్రీకి విద్య అత్యవసర మనునది నిర్వివాదాంశము. కాని విద్యాభ్యాసము యొక్క ఉద్దేశము విజ్ఞానార్జన అయినచో అలా ఆర్జించిన విజ్ఞానము స్త్రీ పురుషులకు సంఘజీవితంలో ప్రతియొక్క రంగములోను అవసరము. విద్యనభ్యసించుట ఉద్యోగాలు చేసి జీవనం చేయడానికని మాత్రమని ఊహించుట పొరబాటు కాగలదు. అందుకనే మద్రాసు యూనివర్సిటీ వైస్‌చాన్సలర్ డా॥ లక్ష్మణస్వామి మొదలియారు ఉపన్యసిస్తూ జాతీయ ఆదర్శలక్ష్యాలకు, ఆచార వ్యవహారములకు భిన్నములేనట్టి విద్యావిధానము స్త్రీలకు ప్రత్యేకముగా రూపొందవలసియున్నదనియు, అందులో సంగీతము, శిల్పము, కుటుంబనిర్వహణకు సంబంధించిన విజ్ఞానము, గృహపారిశుద్ధ్య, ఆరోగ్యసంబంధమైన విజ్ఞానము పొందుపరచవలసియున్నదని వివరించారు.

సంగీతము, లలితకళలు లాంటివి మానవుని ఎప్పటికప్పుడు ఉత్సాహపరుస్తూ పురోభివృద్ధికి మార్గదర్శకములుగా నుండునవి. అవి స్త్రీలచేతులలో రాణించినంతగా పురుషుల చేతులలో రాణించవు. తమ కుటుంబాదాయమును క్రమపద్ధతిలో సద్వినియోగంచేసికొని జీవితావసరములను సమకూర్చుకొనుటకు, ఆరోగ్య సౌభాగ్యములను తీర్చిదిద్దుకొనుటకు, డా॥ లక్ష్మణస్వామిమొదలియార్ సూచించిన అంశాలు స్త్రీలకని రూపొందిన విద్యావిధానములో పొందుపరచబడాలి.

కుటుంబ ఆర్థికవ్యవస్థ పటిష్టంకావడమునకు కుటుంబంలోని స్త్రీలు పురుషులతో సహకరించి కృషి చేయవలసినదే. కాని తమ స్వభావసిద్ధమయిన వ్యక్తిత్వాన్ని పారజాచుకోకుండా తమ శక్తి సామర్థ్యాలకు విరుద్ధంగా పురుషులు చేసే ప్రతిపనిని చేయడాన్ని ప్రోత్సహించే స్త్రీ విద్య జాతీయశ్రేయస్సుకు తోడ్పడజాలదు.

ఒక కుటుంబంలోని భార్యాభర్తలిద్దరు ఉద్యోగాలు చేస్తున్నా, వారి ఆదాయం కుటుంబ ఆరోగ్య సౌభాగ్యముల పోషణకు వినియోగపడకపోయినచో ఆదాయం ఎంతదయినా కుటుంబంలో సుఖముండదు.

స్త్రీలు ఆర్జించిన విద్య, విజ్ఞానములు కుటుంబ సౌభాగ్యమును తీర్చి దిద్దునదిగానుండి విద్యా, వైద్య రంగాలలోను, కాళాకారులుగా ప్రజాహితమును ప్రోత్సహించునవిగా నుండవలెను. కుటుంబములోని స్త్రీ పురుషులు ఒకరినొకరర్థముచేసికొని నలుముఖాల కుటుంబ శ్రేయోపురోభివృద్ధులను ప్రోత్సహించుటకు, తద్వారా సాంఘికంగా అభ్యుదయమును సాధించుటకు డాక్టరు॥ లక్ష్మణస్వామి మొదలియార్‌గారి సూచనలు స్త్రీల విద్యా విధానమును రూపొందించుటలో చాల ప్రధానములైనవి.

(444 పేజి చూడుడు)

# శ్రీ హేవళంబినామ సం॥ర శ్రావణ, భాద్రపదమాసములు

| | | | |
|---|---|---|---|
| 1957 సం॥ ఆగస్టు నెల | 16 | శు | ష 52-58 అశ్వ 59-7 |
| | 17 | శ | స 55-0 భ 60-10 హరిపద పుణ్యకాలం కృతయుగాంతః |
| | 18 | ఆ | అ 55-52 భ 2-24 శ్రీకృష్ణాష్టమి |
| | 19 | సో | న 55-30 కృ 4-48 |
| | 20 | మం | ద 53-50 రో 5-55 |
| | 21 | బు | ఏ 50-57 మృ 5-53 సర్వేషామేకాదశి |
| | 22 | గు | ద్వా 46-57 ఆర్ద్ర 4-38 |
| | 23 | శు | త్ర 41-57 పున 2-18 పుష్య 56-50 |
| | 24 | శ | చతు 36-11 ఆశ్లే 55-11 మాసశివరాత్రి |
| | 25 | ఆ | ● అమా 29-54 మ 50-42 |
| | | | **భాద్రపద మాసము** |
| | 26 | సో | శుపా 23-22 పూఫ 46-2 త్యా 3-42 తిధిద్వయం |
| | 27 | మం | విది 16-49 ఉఫ 41-30 త్యా 3-42 |
| | 28 | బు | తది 10-31 హ 37-21 త్యా 3-43 షోడగౌరీవ్రతం, వరసిద్ధివినాయకవ్రతం |
| | 29 | గు | చ 4-42 ఏష్యం 54-38 చి 33-49 |
| | 30 | శు | ష 55-12 స్వా 1-9 బుద్ధజయంతి |
| | 31 | శ | స 52-12 వి 29-31 వి 26-15 |
| 1957 సం॥ సెప్టెంబరు నెల | 1 | ఆ | అ 50-24 అనూ 29-1 |
| | 2 | సో | న 49-51 జ్యే 29-45 |
| | 3 | మం | ద 50-31 మూ 31-41 |
| | 4 | బు | ఏ 52-20 పూషా 34-46 |
| | 5 | గు | ద్వా 55-10 ఉషా 38-52 వామనజయంతి |
| | 6 | శు | త్ర 58-48 శ్ర 49-49 |
| | 7 | శ | చతు 60-10 ధ 49-23 త్యాజ్యాభావః అనంతపద్మనాభవ్రతం |
| | 8 | ఆ | చతు 3-8 శత 55-20 |
| | 9 | సో | ○ పౌ 7-49 పూభా 60-10 త్యా 4-25 |
| | 10 | మం | కృపా 12-12 పూభా 1-20 |
| | 11 | బు | విది 16-30 ఉభా 7-9 త్యా 4-22 |
| | 12 | గు | తది 20-18 రే 12-29 త్యాజ్యాభావః |
| | 13 | శు | చ 23-19 అశ్వ 17-14 |
| | 14 | శ | పం 25-23 భ 20-43 |
| | 15 | ఆ | ష 26-19 కృ 23-24 త్యాజ్యాభావః |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1–25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3–10 6 ఔ॥ రు. 5–50

## క్షీరబలాతైలం

స్త్రీలకు బుతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3–0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2–0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4–0

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు–14.

ఆంధ్ర ప్రదేశ్ కు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ – సికిందరాబాదు.